


రామయ్యా, చంగయ్యా ఇరుగుపొరుగు ఇళ్ళ వాళ్ళు. రామయ్య సామాన్యపు రైతు. కాని ఆయన కేలోపమూ లేదు. ఆయన ఇల్లు సంతోషంతోనూ ఆనందంతోనూ నిండిఉండేది. ఆయనకు నారాయణ అనే కొడుకూ, సుబ్బలక్ష్మి అనే కూతురూ ఉన్నారు. నారాయణకు పెళ్ళి అయింది. భార్య శాంతమ్మ, నిజంగా శాంతమ్మే. వారి కొక నలుసుకూడా ఉన్నాడు. నారాయణ పొలంపని చూసేవాడు. రామయ్య కృష్ణా రామా అంటూ కాలక్షేపంచేస్తున్నాడు.

సుబ్బులు కింకా పెళ్ళికాలేదు. అయితే ఆమెకు చంగయ్యకొడుకు సత్యం రాసిపెట్టి ఉన్నాడని అందరూ అనుకున్నదే. సత్యం నారాయణ సాటివాడే. పట్నంలో కాలేజీచదువు చదువుతున్నాడు.

చంగయ్య వడ్డీవ్యాపారం చేసేవాడు. బాకీలు వసూలుచేసిపెట్టటందుకు రంగన్న అనేవాడు చంగయ్యకు చేదోడుగా ఉండేవాడు. ఎవరిదగ్గిర వారిమాటలు చెబుతూ కాలక్షేపం చేసే పంతు లొకాయన చంగయ్యకు వాదోడుగా ఉండేవాడు.

చంగయ్య ఇంటికి కాస్త కళాకాంతీ ఏమన్నా ఉంటే దానికి కారణం సుబ్బులే. చంగయ్య లోగిట్లో ఆడదిక్కుగా ఉండి సుబ్బులు "చంగయ్యమామకు" ఏలోపమూ రాకుండా చూసేది.

రామయ్య ఉదారస్వభావుడు, ధర్మబుద్ధి కలవాడు. ఆయనమాట గ్రామానికంతకూ గురి. చంగయ్యకున్న పలుకుబడి యావత్తూ డబ్బును బట్టి వచ్చినదే. స్వతహాగా చంగయ్య పట్టుదల కలవాడు, పిసినిగొట్టు, దైవచింతన లేనివాడు, కఠినహృదయుడు.

అయినప్పటికీ రెండు కుటుంబాలకూ ఎంతో అన్యోన్యం ఉండేది. దీపావళికి ఊరికి వచ్చి నప్పుడు సత్యం తన ఇంట్లోకన్న రామయ్య ఇంట్లోనే ఎక్కువకాలం గడిపాడు. పండగ ఎంతో ఆనందంతో గడిచిపోయింది. మరి కొద్దిరోజుల్లో



మరొకరికోసం అబద్ధమాడతాడా? సత్రాన్ని అద్దెకిచ్చే అధికారం చంగయ్యకు లేదని రామయ్య సాక్ష్యం ఇచ్చాడు.

చంగయ్యకు మండిపోయింది. ఆగ్రహం కళ్ళు కప్పేసింది. విసంకక్కుతూ ఇంటి కొచ్చాడు. రెండిళ్ళమధ్యా ఎల్లప్పుడు తెరిచి ఉండే వాకిలి కాస్తా మూయించాడు. రోజూ లక్ష్మి ఆ వాకిలికుండానే వచ్చి తన ఇల్లు పావనంచేసి పోతుందని ఆ అంధుడు తెలుసుకో లేకపోయాడు.

పరిస్థితి ఇట్లా పరిణమించటం చూసి విరక్తి చెంది సత్యం శలవలు పూర్తికాకుండానే పట్నా నికి తిరిగి వెళ్ళిపోయినాడు. అతను పట్నంలో తన గదికి వెళ్లేసరికి ఒక వింతదృశ్యం కని పించింది. అతని గదిలో ఉండే స్నేహితుడొక అనుమానాస్పదమైన ఆడమనిషిని తెచ్చి ఆ ఇంటో మకాం పెట్టాడు. ఆ మనిషి చౌకబారు మనిషి అని సత్యం గ్రహించి ఆమెను తక్షణమే వెళ్ళగొట్టమని స్నేహితుణ్ణి కోప్పడ్డాడు. దానితో ఆ మనిషికి మండింది. సత్యంమీద ఎట్లాగైనా కసితీర్చుకుంటానని ప్రతిజ్ఞచేసి ఆమె వెళ్ళింది.

సత్యం బజారుకువెళ్ళి రామయ్య కుటుం బంలో అందరికీ తలా ఒక బహుమానమూ కొని బంగీకట్టి రామయ్యపేర పంపించాడు. ఈ బంగీ రామయ్య ఇల్లు చేరేసరికి పంతులు అక్కడ ప్రత్యక్షమైనాడు. మామూలు పరిస్థితులలో అయితే ఈ బహుమానాలకు రామయ్య కుటుంబం ఎంతైనా సంతోషించిఉండును. కాని ఇవాళ వారి మొఖాన కళా కాంతీ లేదు.

సత్యం రామయ్య కుటుంబానికి బహుమానాలు పంపాడన్నవార్త తీసుకుపోయి పంతులు చంగయ్య దగ్గిర ఊదాడు.

రెండు కుటుంబాలమధ్యా ఎటువంటి చిచ్చు రగలబోతున్నదీ ఎవరూ ఊహించలేదు.

ఆ ఊరిమధ్యన చెంగయ్యనాయన కట్టించిన ధర్మసత్రం ఒకటి ఉన్నది. దానికి చంగయ్య ధర్మకర్త. బంగారుసెట్టి తన కొడుకుచేత ఆ సత్రంలో కొట్టు పెట్టించాలని తలపెట్టాడు. రంగన్న సెట్టికి సహాయంచేశాడు. పంతులుకూడా ప్రోత్సహించాడు. చంగయ్య సరేనని అద్దెకిచ్చాడు.

కాని సత్రంలో చాలా కాలంగా పిచ్చన్న అనే బిచ్చగాడు ఉండేవాడు. అతన్ని వెళ్ళగొట్టే విషయంలో సెట్టికొడుకులకూ ఊళ్ళోవాళ్ళకూ తగూ జరిగింది. చంగయ్య సెట్టిని వెనకవేసుకు వచ్చి పోలీసు రిపోర్టు యిప్పించాడు. తనమీద పక్షపాతం చూపించకపోతాడా అనీ, రామయ్య చెప్పినదానికి తిరుగుండదనీ భావించి చంగయ్య రామయ్యను సాక్ష్యం వేసుకున్నాడు. తనకు సర్వనాశనమైనా అబద్ధం చెప్పని రామయ్య

"మీ భ్రమగాని అబ్బాయి ఎప్పుడో వారిపక్షమై పోయాడు." అన్నాడు రంగన్న, మండేనిప్పులో నెయ్యిపోస్తూ.

"పంతులూ, రామయ్య మన కేదో బాకీ ఉన్నట్టున్నాడు. ఇస్తాడేమో కనుక్కో," అన్నాడు చంగయ్య.

కొంతకాలంకిందట రామయ్య పొలం కొనుక్కోవటానికి పదిహేనువందలు కావలిసివస్తే చంగయ్య అప్పిచ్చాడు. కాని అప్పుడే రామయ్య అందులో వెయ్యిరూపాయలు, రెండు దఫాలుగా అయిదేసి వందలచొప్పున, చెల్లిచ్చాడు కూడానూ.

పంతులువచ్చి రామయ్యతో చంగయ్య అన్నమాట చెప్పాడు. ఎక్కడన్నా ఏడువందలు అప్పు పట్టుకురమ్మని రామయ్య తన కొడుకు నారాయణతో చెప్పాడు.

మళ్ళీ అప్పెందుకని శాంతమ్మ తన నగలు తీసి భర్తకిచ్చి వాటిని తాకట్టుపెట్టి సొమ్ము తీసుకురమ్మని చాటుగా చెప్పింది. నారాయణ తన భార్య నగలను బంగారుసెట్టి దగ్గిరే తాకట్టుపెట్టి ఏడువందలూ తెచ్చి బాకీ చెల్లించటానికి చంగయ్య ఇంటికి పోయినాడు.

నోటుకింద చెల్లుపడవలసిన మొత్తం పదిహేడు వందలని చంగయ్య గుమాస్తా చెప్పేసరికి, అదివరకు చెల్లిచ్చిన వెయ్యి రూపాయలూ చంగయ్య మింగి కూర్చున్నాడని నారాయణ తెలుసుకున్నాడు. నోటికి వచ్చినట్టల్లా పేలాడు. "ఛీ. నీదీ ఒక బతుకే?" అని చంగయ్యను తిట్టి బుసలుకొట్టుతూ ఇంటికి వచ్చాడు. ఆగ్రహశేషాన్ని తండ్రిమీద ప్రయోగిస్తూ, "నమ్మినా భలేవాణ్ణి నమ్మావు, నాన్నా! షావుకారు చంగయ్యంటే ఎవరికి తెలీదు?" అన్నాడు.

రామయ్య చంగయ్య ద్రోహాన్నయినా సహించాడుగాని కొడుకు ఆగ్రహం సహించలేకపోయినాడు. "నువన్నది నిజంరా, తప్పంతా నాదే!"





అన్నాడు. ఆ సహనంముందు నారాయణ అగ్రహం మంచువిచ్చినట్టు విచ్చిపోయింది. మిగిలిన వెయ్యి రూపాయలు కూడా అప్పు పుట్టించటానికి బయలుదేరాడు.

మర్నాడు రామయ్య సొమ్ముతీసుకుని బాకీ పరిష్కారానికి వచ్చినప్పుడు చంగయ్య అరుగు మీద చేరినవాళ్లెవరికీ కత్తివాటు వేస్తే నెత్తురులేదు.

"నారాయణ చిన్నతనంవల్ల తొందరపడి అన్నమాటలు మనసులో ఉంచుకోకు, బావా. దీంతో నీ ధనరుణం తీరుతుందిగాని నీ దయా రుణం తీరదు! అది తీరిననాడు....వస్తా. బావా!" అని రామయ్య వెళ్ళిపోయినతరవాత చంగయ్య మళ్ళీ సరిగా శ్వాసపీల్చాడు. మిగిలినవాళ్ళలో కూడా మళ్ళీ చైతన్యం వచ్చింది.

చంగయ్య స్వార్థం గెలిచింది. కాని రామయ్య నైతిక విజయం చంగయ్యను చిత్తుగా ఓడించింది. ఆసంగతి చంగయ్యకు తెలిసేఉండాలి. అందుకనే రామయ్యమీద చంగయ్య మళ్ళీ కత్తికట్టాడు. ఈసారి పన్నాగం రంగడిది. నూర్చటానికి సిద్ధంగాఉన్న రామయ్య కుప్ప తగలబెట్టాలని రంగడికి పుట్టింది. ఈ సంగతి పసికట్టి పంతులు నారాయణతో పంట యింటికి చేరిందాకా జాగ్రత్తగావుండమని హెచ్చరించాడు.

ఎట్లాగైనా నారాయణ జాగ్రత్తమీదనే ఉన్నాడు. అందుచేత కుప్ప తగలబెట్టబోయిన రంగన్నను నారాయణ తలమీద ఒక్కదెబ్బకొట్టి సత్కరించాడు. నెత్తురు వరదలుకారుతూ రంగన్న చంగయ్యఇంటికి వెళ్ళి జరిగినది మార్చి ఇంకోవిధంగా చెప్పాడు.

ఒకప్పుడు సత్రంవిషయంలో బంగారుసెట్టిని వెనకేసుకొచ్చి సగంవరకూ ఊబిలోకి దిగిన చంగయ్య, అహంకారంవిడక ఈసారి రంగన్నను

వెనకవేసుకుని రామయ్యా కుటుంబానికి మరింత ద్రోహం తలపెట్టాడు.

"నువు వీధిలోకిపోయి, నారాయణ నిన్నుకొట్టి డబ్బెత్తుకు పారిపోయినాడని అరు. పైది నేను చూస్తాను," అన్నాడు చంగయ్యా.

ఈ ఎత్తు పారింది. నారాయణ రంగన్నను కొట్టి డబ్బుకాజేశాడని చంగయ్యా కేసుపెట్టి. నారాయణ పారిపోవడం తాను స్వయింగాచూశా నని సాక్ష్యంకూడా ఇచ్చాడు. రెండిళ్ళమధ్యా తలుపు మూసినతరువాత చంగయ్యా గడప తొక్కని సుబ్బులు చంగయ్యాఇంటికి వెళ్ళి, తన అన్నను క్షమించమని బతిమాలింది. చంగయ్యా చలించాడుగాని సుబ్బులుచూపిన వివేకమార్గం చూడలేకపోయినాడు. సుబ్బులు కంట నీరు కారుస్తూ వచ్చినదారే తిరిగి వెళ్లిపోయింది.

నారాయణను పోలీసులు పట్టుకెళ్ళారు.

రామయ్యా నైతికవర్తనా, సుబ్బులు ధైర్యమూ కూడా చంగయ్యాలో తగినసంస్కారం తీసుకు రాలేకపోగా ఈసారి విధి స్వయంగా చంగయ్యా మీద దెబ్బతీసింది.

అక్కడ పట్నంలో చంగయ్యా కొడుకు సత్యం కూడా, నారాయణలాగే, తప్పుడు సాక్ష్యం కారణంగా పోలీసులచేత ఎరెస్టు చేయబడ్డాడు.

ఈ సంఘటన ఈవిధంగా జరిగింది. సత్యం ద్వారా అవమానించబడ్డ వేశ్య, సత్యం స్నేహితుడి ద్వారా తన గొలుసు సత్యం పెట్టెలో వేయించి చోరీకేసు పెట్టింది. సత్యాన్నికూడా పోలీసులు పట్టుకుపోయినారు.

పక్షపాతంలేకుండా ఇద్దరికీ చోరీ నేరానికిగాను చెరి తొమ్మిది నెలల కఠినశిక్ష పడింది.

సత్యమూ నారాయణా జైల్లో కలుసుకున్నారు. ఒకరిసంగతులు ఒకరు తెలుసుకున్నారు. తన



తండ్రి రామయ్య కుటుంబానికీ, నారాయణకూ చేసినద్రోహం వినగానే సత్యం అవమానంతోనూ దుఃఖంతోనూ కుంగిపోయినాడు. "మళ్లీ మనవూరు వెళ్లి అక్కడ నామొహం ఎట్లాచూపించేది?" అని సత్యం వాపోతుంటే నారాయణ అతన్ని ఓదార్చాడు.

తన కొడుకే జైల్లోపడ్డాడని తెలిసేసరికి చంగయ్యకు చెప్పరాని ఆరాటంకలిగింది. ప్లీడర్లను చూశాడు. జైల్లో కొడుకును చూశాడు. తన పితృప్రేమ అంతా వెలకపోశాడు. "ఈ పాపకర్మం ఎట్లాచుట్టుకుందిరా? ఆ స్నేహితుడెవడ్రా?" అని ఈ ప్రశ్నలు వేశాడు. అన్ని ప్రశ్నలకూ సత్యం ఒకటే ఎదురుప్రశ్న వేశాడు: "నారాయణ నిజంగా దొంగతనం చేశాడా?"

"అయిపోయిందేవో అయిపోయింది. నీసంగతి నువు చూసుకోరా!" అని చంగయ్య ఎంత మాట తప్పించినా సత్యం వినిపించుకోలేదు. ఆఖరుకు చెంగయ్య నెత్తిబాదుకుని, "వాడు దొంగతనం చెయ్యలేదురా. ఆగ్రహంతో వొళ్లుతెలియక నేనే వాడిమీద దొంగతనం అంటగట్టారా!" అన్నాడు.

అదే సత్యానికి కావలసింది. సత్యం తనమీద వచ్చిన కేసులో తనను తాను సమర్థించుకొన నిరాకరించాడు. ఒకనాడు తనదగ్గిరికి ఎంతో ఆశతోవచ్చి సుబ్బులు విచారంగా తిరిగి వెళ్లినట్టే, ఇవాళ చంగయ్య, కొడుకుదగ్గిరనుంచి నిరాశతో వెళ్ళిపోయినాడు.

చంగయ్య ఊళ్ళోకిరాగానే నలుగురూ సత్యం విషయమై పరామర్శించారు. వాళ్ళంతా తనను అవహేళన చేస్తున్నట్టనిపించింది. పంతులు పలకరించనుకూడాలేదు. మొహంతప్పించుకుని చూడనట్టు వెళ్ళిపోయినాడు.







రంగన్న చెంగయ్యను నిరుత్సాహంలోనుంచి రెచ్చగొట్ట యత్నించాడు, కాని చంగయ్యలో ఇంకేమి పస మిగలలేదు. ఈ దెబ్బ చాలా బలంగా తగిలింది. రంగన్న తనపేరు చెప్పి బంగారుసెట్టి దగ్గిర నూరు రూపాయలు తెచ్చు కున్నట్టుకూడా తెలిసింది.

"నా పేరు చెప్పి ఇక ఎక్కడా డబ్బు తీసుకు రాకు, తెలిసిందా? ఇకనుంచీ నీ బతుకుతెరువు నువు చూసుకో," అంటూ చంగయ్య బిక్కు బిక్కుమనే ఇంటోకి పోయినాడు. దేవుడే విడిచి పుచ్చిన చంగయ్యను రామి "ఏం బాబూ" అని పలకరించింది. చంగయ్య బావురుమన్నాడు.

రోజులు గడిచాయి. మళ్ళీ దీపావళి వచ్చింది. కాని గడచిన దీపావళి ఎంత కాంతివంతంగా, ఆనందమయంగా ఉందో ఈ దీపావళి అంత కాంతి హీనంగా, ఆనందరహితంగా ఉంది. చంగయ్యకు పొరుగువాళ్లపట్ల తన ధర్మం తెలీనిపాపంచేత సత్యమూ నారాయణాకూడా జైల్లో ఉండటమూ, రెండిళ్లూ అంధకారమయం కావటమూ జరిగింది.

రంగడి కిప్పుడు గడవటం లేదు. రంగన్న వచ్చి చంగయ్యను డబ్బడిగాడు. బతిమాలాడు.

"మనం చేసిన పనులు శానా ఉండయ్యా. మన సంబంధం తెంచుకుందామన్నా తెగేది కాదు." అని చివరికి బెదిరించాడు రంగన్న.

"పోరా, నీ యిష్టంవచ్చింది చేసుకో. నేను జైలుకైనా, ఉరికైనా, దేనికైనా సిద్ధమే." అన్నాడు చంగయ్య.

రంగన్న తిండి పెట్టిన చేతినే కాటెయ్య నిశ్చయించాడు. వాడికి గత్యంతరంలేదు. కాని వాడు చంగయ్య ఇల్లు దోచటానికి ప్రయత్ని స్తున్నాడని రామి తెలుసుకున్నది. వెళ్లి సుబ్బులుతో చెప్పింది.

మంచితనం ఒకరి సొమ్ము కాదు. రామి హృదయం బంగారం. దానికి శత్రువులు లేరు, విచారం అంతకన్నా లేదు. అందరూ ఆనందంగా ఉండటమే దాని కోరిక.

సుబ్బులు, ఈ సంగతి చంగయ్యతో చెప్పాలో వద్దో తేల్చుకోలేకపోయింది. చీకటి పడింది. బుర్రకథ వినటానికి తండ్రి బయలుదేరాడు. ఇంకా సుబ్బులు తేల్చుకోలేదు. దొడ్డి పిట్టగోడ మీదిగా మనుష్యుల తలకాయలు కనిపించాయి. సుబ్బులు ఇక మనసు పట్టలేక పోయింది. శాంతమ్మతో చెప్పేసింది. శాంతమ్మ రామయ్యను పిలుచుకు రావటానికి బుర్రకథ చెప్పేచోటికి బయలుదేరింది.





సుబ్బులు వెళ్ళి చంగయ్యా తలుపు తట్టింది. "మామా!" అని సుబ్బులుగొంతు వినిపించగానే చంగయ్యా మంచంమీదినుంచి చెంగున లేచి వెళ్ళి తలుపు తెరిచాడు. "దొంగలు, మామా!" అని సుబ్బులుచెప్పే మాటలు చెంగయ్యాకు వినిపించలేదు. "నువుటే, సుబ్బులూ? వచ్చావుటే? నువుమళ్ళా రావనుకున్నానే!" అని సుబ్బులును కౌగిలించుకుని వాపోయినాడు.

"దొంగలు వస్తున్నారు, మామా! వెధవడబ్బు పోతే పోయింది. పోదాం రా, మామా," అని సుబ్బులు చంగయ్యాను చెయిపట్టుకులాగింది.

కాని చంగయ్యా అపాయానికి వెన్నివ్వదలచ లేదు. సుబ్బులు చేతిలో తాళాలుపెట్టి ఆమెను బలవంతాన బయటికి పంపి తలుపు గడియ వేశాడు. కాని సుబ్బులు తాళాలు అక్కడే వదిలేసింది. చంగయ్యా వాటిని మెట్లకిందికి పారేశాడు.

రంగన్న తలుపుతట్టి పిలిచాడు. చంగయ్యా వెళ్ళి తలుపుతీశాడు. మరుక్షణం ముగ్గురు దొమ్మరవాళ్ళతో రంగడు లోపల ప్రవేశించి చంగయ్యాను పట్టుకుని స్తంభానికి కట్టేశాడు. ఇనప్పెట్టె తాళా లిమ్మన్నాడు రంగన్న. చంగయ్యా దగ్గిర అవి లేవు. చంగయ్యాను కర్రతో పొడిచారు. కాని చంగయ్యా చెప్పలేదు.

సుబ్బులు తలుపవతలనుంచి ఆలకిస్తూనే ఉన్నది. ఆమె తలుపు తట్టి కేక పెట్టింది. రంగన్న తలుపు తెరిచాడు. తాళాలసంగతి ఆమెకు తెలిసిఉంటుందనుకుని ఆమెనుకూడా గుంజకు కట్టేయించాడు. ఆమెకు నిప్పంటించే ప్రయత్నంలో ఉండగా చూడలేక చంగయ్యా తాళాలు మెట్లకింద ఉన్నాయని చెప్పాడు. రంగన్న ఆ తాళాలతో ఇనప్పెట్టె తెరిచి అందులో సొమ్మూ నగలూ తస్కరించి పారిపోబోతూ ఉండగా బుర్రకథనుంచి రామయ్యా మొదలైన వాళ్ళంతా తిరిగివచ్చి రంగన్నను పట్టుకున్నారు.

తరవాత కొద్దిరోజులకే సత్యమూ నారాయణా విడుదలై వచ్చారు. మళ్లీ రెండు కుటుంబాలూ ఎప్పటిలాగే కలిసిపోయాయి.

సత్యానికీ సుబ్బులుకూ పెళ్లి జరిగింది. అందరూ సుఖంగా ఉన్నారు.



పురుషులను కవ్వించి
స్త్రీలను గర్వింప చేసిన

వాహినీ వారి

# గుణసుందరి

కథ...

సంప్రదాయం, సంస్కారం
శిల్పవిశిష్టత శోభించిన
అసమాన జానపద చిత్రం..

**నేడే చూడండి!**





డైరెక్టర్
కె.వి.రెడ్డి B.Sc.(HONS)

స్టూడియో
వాహిని..

చందమామ

ఈ సంచికలో యివి
చదువుకోండి



ఇవన్నీగాక పజిలు, ముగ్గులు,
ఇంతా, ఇంకా ఎన్నోవున్నై.

చందమామ ఆఫీసు
పోస్టుబాక్సు నెంబరు 1686
మద్రాసు-1.

నాలుగు భాషలలో
# చందమామ



(తెలుగు) **చందమామ**

విడిసంచిక 0-6-0 సాలుచందా: 4-8-0 రెండేండ్లకు: 8-0-0

(కన్నడ) **చందమామ**

విడిసంచిక 0-6-0 సాలుచందా: 4-8-0 రెండేండ్లకు: 8-0-0

(హిందీ) **చందమామ**

విడిసంచిక 0-6-0 సాలుచందా: 4-8-0 రెండేండ్లకు: 8-0-0

(అరవ) **అంబులిమామ**

విడిసంచిక 0-6-0 సాలుచందా: 4-8-0 రెండేండ్లకు: 8-0-0

చందమామ పబ్లికేషన్స్
పోస్టు బాక్స్ 1686 :: మద్రాస్-1

# రు. 500 బహుమానము

## ఉమా గోల్డు కవరింగు వర్క్సు

ఉమా మహల్ :: మచిలీపట్నము

ఉమా గోల్డు కవరింగు వర్క్సు పోస్టాఫీసు.
















UMA 607 Stone Ring



UMA 739 Stone Button

అసలు బంగారు రేకు లోహము పైన అంటించి (Gold Sheet Welding on Metal) తయారు చేయబడినవి. కాదని రుజువు చేసినవారికి రు. 500 బహుమానమివ్వబడును. మేము తయారు చేయు ప్రతివస్తువు ప్యాకింగు పైన "ఉమా" అను ఇంగ్లీషు అక్షరములు గుర్తించి కొనవలెను. బంగారు వన్నె 10 సంవత్సరములు గ్యారంటీ.

* * *

పరీక్ష చేయగోరువారు ఉమా ఆభరణములను మహాద్రావకములో వేసిన 5 నిమిషములకే బంగారము రేకు వెడలివచ్చును. ఈ విధముగా పరీక్ష చేసినవారు అనేకమంది మాకు సర్టిఫికేట్లు యిచ్చియున్నారు. 800 డిజయినుల క్యాటలాగు ఉచితముగా పంపబడును. ఇతర దేశములకు క్యాటలాగు ధరలమీద 25% అధికము.

*N.B.*—వస్తువుల వి. పి. పార్శిలు చార్జి 0 - 15 - 0 మాత్రమే అగును.

Tel: "UMA" MASULIPATAM.



# డోంగ్రేగారి

## బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టియున్ను, పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనములు నిలిపి, బలమును, ఆరోగ్యము నిచ్చును.

K.T. Dongre & Co. BOMBAY - 4

# 'చందమామ'కు

## ఏజంట్లు కావాలి

●

ఏజంట్లు లేనిచోట్ల ప్రతి ఊరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలు కూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 2-0-0 పంపుతూ వుంటే మీకు 7 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిన మీకు ప్రతినెలా 0-10-0 లాభం వుంటుంది. పూర్తి వివరాలకు మాకు వ్రాయండి.

చందమామ ఆఫీసు,
పోస్టుబాక్సు నెం. 1686, మద్రాసు - 1.



# చందమామ

పిల్లల కథల మాసపత్రిక

సంచాలకుడు: చక్రపాణి

సంపుటి 6 | ఏప్రెల్ 1950 | సంచిక 4

'విరోధి' గడిచి 'వికృతి' వచ్చింది. ఈ కొత్త సంవత్సరంలో 'సామెత కథలు' అనే ఒక కొత్త శీర్షికను ప్రారంభింప దలిచాము. మచ్చుకి— 'కోటి విద్యలూ కూటి కొరకే,' 'నే పట్టిన కుందేటికి మూడే కాళ్లు,' 'లోగుట్టు పెరుమాళ్ళకు ఎరుక'— అని ఈ మోస్తరు సామెతలకు సంబంధించిన కథలను లోగడ మీరు చందమామలో చదివేఉన్నారు. ఇటు వంటి సామెత కథలను పెద్దలవల్ల మీరు ఎన్నో వింటూ ఉంటారు. అలా మీకు తెలిసిన వాటిలో మంచి సామెత కథలను వ్రాసి పంపండి. మాకు చేరినవాటిలో బాగాఉన్న కథలను చందమామలో వీలువెంట ప్రచురించి, ఆ కథలను వ్రాసిన వారికి తగిన బహుమతికూడా ఈయదలిచాము. కథలు మరీ పెద్దవి కాకుండా మరీ చిన్నవి కాకుండా నాలుగైదు పేజీలవిగా వుండాలి. కథలను మాకు బుక్ పోస్టు ద్వారా పంపవచ్చు. కవరు పైన ఈక్రిందివిధంగా అడ్రసు వ్రాయాలి.

చందమామ 'సామెత కథల' పోటీ,

చందమామ ఆఫీసు,

పోస్టుబాక్సు నెం. 1686, మద్రాసు-1





# ఖడ్గతిక్కన

ఖడ్గతిక్కనొక్కనాడు
కదనమునకు వెళ్ళెనూ;
వెళ్ళి ఓడిపోయి యంత
ఇంటివైపు పాఱెనూ.

వాని రాక పెండ్లమంత
విస్తుపోయి చూచెనూ;
చూచి ఒక్కసారిగాను
ఇంటిలోకి పోయెనూ.

తల్లివచ్చి వానిజూచి
మోము తిప్పుకొనియెనూ;
'అయ్యో! యిట్టి పిరికిపంద
ఏల పుట్టె' ననియెనూ.

ఒంటి నిండ రక్తధార
లూరిపోవు చుండగా,
స్నానమాడ బావిదరికి
తలను వంచి వెడలెనూ.

బావివద్ద భార్యయంత
నులకమంచ ముంచెనూ;

రచన:
దుర్గా గణేశదత్, రాజమండ్రి

ఉంచి పసుపుముద్ద వాని
చేతిలోన పెట్టెనూ.

తిక్కనంత తెల్లబోవ,
భార్యలోని కేగుచూ
'మీకు నాకు భేదమేమి?
చెప్పుడం'చు నవ్వెనూ.

తిండి తింటు 'పాలువిఱిగె'
ననగ తల్లి యిట్లనెన్:
'పౌరుషంబె విరిగినపుడు
పాలువిరుగ వేమిటీ!'

తిక్కనంత తనదు తప్పు
తెల్పుకొంటి ననియెనూ;
అంచు వేగమేను యుద్ధ
భూమిలోని కేగెనూ.

ఉరికి పిరికి వీడనాడి
వీర రణము చేసెనూ;
చేసి విజయలక్ష్మితోడ
వీరస్వర్గ మొందెనూ.








అనగనగా ఒకవూళ్ళో సీనయ్య అనే కుర్రవాడు ఉండేవాడు. వాడు పుట్టు దరిద్రుడు. రూపసికూడా కాదు. అటువంటి వాని మొహం ఎవరుచూస్తారు?

అయితే, సీనయ్య కంఠ మెత్తితే గంధర్వ గానం ప్రవహిస్తుంది! అతనివద్ద పూర్వులు విడిచిపోయిన ఆస్తి ఒకే ఒక సితారు ఉన్నది. ఆ సితారుమీద శృతి పెట్టుకుని సీనయ్య పాడటం ప్రారంభిస్తే, ఆ పాటకు ప్రపంచమంతా స్తంభించి తన్మయమై పోయేది. నెమిళ్ళూ, లేళ్ళూ, నాగులూ ఆలకింప వచ్చేవి. మోడులు చిగిర్చేవి.

ఇటువంటి అద్భుతమైన గానం ఎన్నడూ ప్రతిఫలం కోరి చేయలేదు సీనయ్య. యమునా నది ఒడ్డున చల్లగాలిలో కూర్చొని తన ఆనందంకోసమే పాడేవాడు. క్రమంగా అతనికి 'సితారు సీనయ్య' అనే పేరు సార్థకమైంది.

సీనయ్య యమునా తీరాన కూర్చుని పాడుతూవున్నప్పుడు ఆ గానం అపూర్వంగా వుండేది. అది విని ప్రజలు జేజేలు కొట్టేవారు. అతను పాడే ప్రతి చరణానికీ "సీనయ్యా, మరొక్కసారి పాడు!!" అంటూ అతన్ని బతిమలాడేవాళ్ళు.

యమునానదీతీరాన కూర్చున్నప్పుడల్లా సీనయ్యకు చెప్పలేని ఉత్సాహము పొంగి పొరలి వచ్చేది. అక్కడ అతను మధురాతి మధురమైన గానం చేయగలిగేవాడు. ఆ ఆవేశంలో అతను "ఈ యమునానాసుందరి. యమునను పోలిన సుందరి ఈ పధ్నాలుగు భువనాల్లోనూ లేనేలేదు" అంటూ ఉండేవాడు. యమునా తీరాన కూర్చుని పాడుకొంటూవుంటే సీనయ్యకు నిద్రాహారాలే అవసరం లేకపోయేవి.

ఒకనాడు సీనయ్య యమునాసుందరిని పొగడుతూ పాడుకొంటూ వుండగా,

యం. ప్రకాశరావు, గుత్తి






సముద్రం మధ్యని ఒక సుడిగుండం చుట్టుకొని, గిరగిర తిరుగ నారంభించింది. అందులోనించి క్రమంగా ఒక కిరీటధారి తల కనిపించింది. ఆయన ఎంతో ఆకర్షణీయంగా బ్రహ్మాండంగా ఉన్నాడు. ఆయన ఇవతలకు వస్తున్నాడనగా సముద్రపు కెరటాలన్నీ భయభక్తులతో అటు యిటు తప్పుకొని, దారిచేశాయి.

ఆయన సీనయ్యను పిలిచి, "చూడు సీనయ్యా! నన్ను సాగర మహారాజు అంటారు. భూలోకంలో ప్రవహించే జీవ నదులన్నీ నా కుమార్తెలు. నేనూ నా కుమార్తెలూ నీ మధురగానం విని పరవశులమైనాము. ఇందుకుగాను నిన్ను బహూకరించదలిచాము. కనుక, నా నీటిలో ఒక వల పరచావంటే నీకు తగిన సన్మానం జరుగుతుంది. అయితే, ఒక్క షరతుమాత్రం నువు జాగ్రత్తగా వినాలి: బహుమతిపొందిన తరువాత నువు పాతాళ లోకమందలి మా రాజ్యంలో ఉండే పచ్చల మందిరానికి వచ్చి, అక్కడ మేము కోరినంత కాలమూ ఉండి గానంచేసి మమ్మల్ని ఆనందింప జేయాలి" అని చెప్పి అదృశ్యమయ్యాడు.

సాగరమహారాజు వెళ్ళిపోగానే, కెరటాలు ఎప్పటిలాగా మూసుకుపోయి, సముద్రం మళ్ళీ ప్రశాంతంగా ఉన్నది.

మరునాడు సీనయ్య వల పట్టుకవచ్చి సముద్రంలో వేసేవరకు, అందులో ఒక పెట్టె కొట్టుకువచ్చింది. ఆ పెట్టె పగలగొట్టి చూడగా అందులో కోకొల్లలుగా నవరత్నాలున్నాయి. సీనయ్య వాటిని తీసుకుపోయి ప్రపంచంలోని అన్ని దేశాలతోను రత్నాల వర్తకం సాగించి, పేరూ ప్రఖ్యాతీ గడించి, చూస్తూవుండగానే కోటీశ్వరుడైనాడు.

ఇలా సీనయ్య దశ మారగానే ఎన్నడూ ఎరగనివాళ్ళు సైతం అతని ఎదటికి వచ్చి



సముద్రం దాటి విదేశాలకు పోవటానికి సంకల్పించుకున్నాడు సీనయ్య. అది దూరపు ప్రయాణం కావటంచేత చాలా రోజులు పట్టింది. సీనయ్య యథాప్రకారం ఓడ టాపుమీద కూర్చొని యమునా సుందరిని పొగడుతూ, పాడుతూ వున్నాడు.

ఇంతలో అకస్మికంగా పెద్దగాలి తుపాను వచ్చి ఓడ నడవటం మాని వేసింది. ఎవరికీ, ఏమీ పాలుపోయింది కాదు. అందరూ కంగారుపడుతున్నప్పటికీ సీనయ్య మటుకి నిశ్చలంగా పాడుకుంటూ టాపుమీద కూర్చునేవున్నాడు.

అప్పుడు ఓడ యజమాని "ఈ ఓడపైన వున్న మనలోనే, ఒక గొప్ప వాగ్దానంచేసి ఆ వాగ్దానం నిలబెట్టుకొని వాడు ఎవడో వుండి వుండాలి. వాడి పీడే మనకి పట్టుకుని వుంటుంది. లేకపోతే సముద్రుడికి యింత కోపం కలగదు. వాడెవడో కనిపెట్టి ఓడ మీదినుంచి దింపివేస్తేగాని ఈ విపత్తు తొలగదు. అలా మాట తప్పినవాడెవడో మర్యాదగా బైట పడండి. లేకపోతే మనం అందరం సర్వనాశనమైపోతాం" అని అరిచాడు.

అప్పటివరకు మరోధ్యాస లేకుండా తన గానంలో లీనమై పోయిన సీనయ్య

ఎంతో గొప్పగా పొగడసాగారు. ఎవ రేమనుకొన్నప్పటికీ, సీనయ్యలో మాత్రం కాస్తంతకూడ మార్పు రాలేదు. ఎప్పటి లాగానే, సితారు చేతపట్టుకొని యమునా తీరాన కూర్చుని హాయిగా నిశ్చింతగా మధురగానం చేసుకొనేవాడు. పాటలతో యమునను పొగడటమే కాదు, ఎంతో ఆప్యాయంతో దేశదేశాలనుంచి తెచ్చిన అపూర్వమైన కానుకలు, అలంకారాలు, మణిహారాలూ తన యమునాసుందరికి అర్పిస్తూ ఉండేవాడు.

ఈ విధంగా పన్నెండేళ్ళు గడచిన తరువాత ఒకప్పుడు రత్నాల వర్తకంకోసం

ఓడ యజమాని కేకలు వినిపించగానే పరుగున వాళ్ళమధ్యకు వచ్చి, "అయ్యా ఆ మాట తప్పినవాడిని నేనే. సముద్రుడికి మాట ఇచ్చాను. ఇదుగో ఇప్పుడే నా పీడ మీకు వదిలిపోతుంది" అంటూ తన సితారుతోసహా ఓడమీదినించి ఆ మహా సముద్రంలోకి గభీమని దూకివేశాడు.

సీనయ్యా దూకి మునిగిపోగానే అతనికి దారిచేసిన సముద్ర తరంగాలు మళ్ళీ ఎప్పటివలె మూసుకుపోయినై. అతను నీటిలో అడుగుకంటా దిగి పోతూవుండగా చిత్రాతిచిత్రాలైన జలచరములు ఎన్నెన్నో కనపడినై. వీటనన్నింటనీ వేడుకతో చూసు కొంటూ, సీనయ్యా చివరకు కిరీటధారి ఐన సాగర మహారాజు ఉండే పచ్చలమంది రానికి చేరుకొన్నాడు.

ఆ మందిరం సీనయ్యా కని విని ఎరుగని అలంకారాలతో, ఆకర్షణలతో అపూర్వంగా వున్నది. "ఏమయ్యా, సీనయ్యా, నీకోసం మేము ఇక్కడ ఒకటికాదు రెండుకాదు పన్నెండేళ్ళనించి ఎదురుచూస్తూవుంటిమే, మమ్మల్ని మరిచేపోయినావా!" అనేవరకు, సీనయ్యా "మహారాజా! నా యమునా




సుందరిని తలుచుకుని గానం చేసుకొంటూ వుంటే లోకమే మరిచిపోయాను. నిజమే. మన్నించాలి" అన్నాడు.

అప్పుడు సాగర మహారాజు సీనయ్యాను ప్రేమతో బుజం తట్టి, "ఇప్పుడైతే యేమి, పోయిందిలేదులే. త్వరగా సితారు తీసి వాయించు" అని ప్రోత్సహించాడు. సీనయ్యా సితారు చేతబట్టి గానం చేసేటప్పటికల్లా నెమిళ్ళూ, లేళ్ళూ, నాగులూ ఆలకింప వచ్చినై. కిరీటధారి ఐన సాగర మహారాజు ఆ సంగీతానికి తన్మయుడై, సింహాసనం మీదినుంచి లేచి నృత్యంచేయ సాగాడు. సముద్రంపైన నడుస్తున్న నావలు ఆ

బ్రహ్మాండమైన కెరటాలలో ఉయ్యాలలాగా ఊగిపోసాగినై.

ఇంతలో కోటలోనించి బిలబిలమంటూ ముప్పదిమంది అపురూపసుందరులైన కన్నెలు అక్కడకు వచ్చి నిలబడ్డారు. వారిని చూడగానే మహారాజు మళ్ళీ మన దృష్టిలో పడి, "సీనయ్యా! నీ పాటకు మేమందరమూ సంతోషించాము. ఈ ముప్పదిమందీ నా కుమార్తెలు. వీరిలో ఎవరుకావాలో ఎంచుకో. ఆమెను నీకు ఇచ్చి పెళ్ళిచేస్తాను" అనేవరకు, సీనయ్య ఒకొక్కరినీ చూచీ, ఇరవైతొమ్మిది మంది కన్యలూ తనకు నచ్చలేదన్నాడు.

చివరకు మిగిలివున్న కన్యవద్దకు వచ్చి "ఈమె ఒక్కర్తే నా యమునాసుందరిని పోలివున్నది," అని తన సంతోషాన్ని తెలిపాడు. "ఈ పధ్నాలుగు భువనాల్లోనూ ఈమె ఒక్కర్తే సుందరమైనది" అన్నాడు సీనయ్య. ఆమె కిలకిల నవ్వింది.

"ఈ నవ్వు అచ్చు నా యమునాసుందరి ప్రవాహ ధ్వనిలాగానే వున్నది" అని పొంగి పోయాడు సీనయ్య.

మరికొంతసేపు పరికించి చూడగా సీనయ్య దేశదేశాలనుంచి తెచ్చి యమునా నదికి అర్పిస్తూవచ్చిన ఆ చిత్రమైన మణి హారాలూ అలంకారాలూ అన్నీ ఆమె ఒంటి మీద కనపడినై.

అప్పుడు కిరీటధారి ఐన సాగరమహా రాజు చిరునవ్వు నవ్వుతూ, కిలకిల నవ్వే ఆ కన్య చేతిని సీనయ్య హస్తాలలో ఉంచుతూ "సీనయ్యా! ఇంతకాలంనించీ నీ సితారు ఎవరిని గురించి ఐతే గానంచేస్తూ వున్నదో, ఆ యమునాసుందరే ఈమె! నీవు ఇచ్చిన కానుకలన్నీ ఆమె అందు కుంటూనేవుంది. చూడు. మీరిద్దరూ ఈపచ్చల మందిరంలోనే హాయిగా వుండండి!!" అని దీవించి, ఇద్దరకూ వైభవంగా వివాహం చేశాడు.






మరునాడు ధీరసింహుడు సులోచనవద్దకు వెళ్ళగా, ఆమె ఉచిత మర్యాదలతో అతన్ని కూర్చోబెట్టి, తన సమస్యచెప్పింది: "నైరుతి దిక్కున ఒక మాయస్నానాల గది ఉన్నది. దాని పుట్టుపూర్వోత్తరాలు నాకు చెప్పాలి" అనేవరకు, యథాప్రకారం గడువు తీసుకొని ధీరసింహుడు నైరుతి దిక్కుగా బయల్దేరాడు.

కొంతదూరం వెళ్లేవరకు అతనికి ఒక పట్టణం కనిపించింది. ఆ పట్టణం పొలిమేర దాటగానే ఒక బావి కనపడింది. ఆ బావిదగ్గర దుఃఖంతో వున్న ముసలి దంపతులు, వారిచుట్టూ మూగిన చాలా మంది జనం కనపడ్డారు. ఈచిత్రం ఏమిటా అని ధీరసింహుడు అక్కడివాళ్లను అడిగేసరికి, "అయ్యా! ఈ ముసలివాళ్లకు ఒక్కగానొక్క కొడుకు. వారంరోజుల క్రిందట పాపం, అతనికి పిచ్చెత్తి, గభీమని ఈ బావిలో దూకాడు. పోనీ దూకినవాడు చచ్చాడని అనుకుందామా అంటే, ఇప్పటి వరకు వానిశవం పైకితేలలేదు. అందుకని, ముసిలివాళ్ళు నిద్రాహారాలులేక ఇలా విలపిస్తున్నారు" అంటూ వారు చెప్పారు.

ధీరసింహుడు ఒక్క నిమిషమైనా ఆలస్యంచేయక, ఆ వృద్ధులతో "మీరు దుఃఖించక ఇక్కడనే వేచి ఉండండి. ఒక్క చిటికెలో మీ అబ్బాయిని తీసుక వచ్చి మీ ఎదట పెడతాను" అని చెబుతూనే బావిలోకి దూకాడు. అతని ఈ సాహసానికి అందరూ ఆశ్చర్యపోయారు.

అతను ఆ బావిలో దూకి, లోతుకంటా పోయేవరకు కాలికి నేల తగిలింది. ధీరసింహుడు ఆగి అటు యిటు చూడగా, ఒక రహస్య ద్వారం కనపడింది. ఆ ద్వారంగుండాపోయి అతను ఒక పూలతోట చేరుకొన్నాడు. తోటలో ఒక దివ్యభవనం

కనపడేసరికి, అతను ధైర్యంతో, ఆ భవనం ప్రవేశించాడు.

భవనం మధ్యని ఒక పెద్దహాలు ఉన్నది. హాలంతా దేదీప్యమానమైన మణి దీపాలతో వెలిగిపోతున్నది. అక్కడ చాలా మంది దేవతాస్త్రీలు కూర్చునివున్నారు. వారి మధ్య, చుక్కలలో చంద్రునివలె అపురూపసుందరమైన ఒక రాజకుమారి, ఆమె ప్రక్కన ఒక చక్కటి రూపసిఐన యువకుడూ కూర్చొనివున్నారు. రాజకుమారి దేవతాస్త్రీయే, కాని యువకుడు మాత్రం మానవజాతికి చెందినవాడు. ఈ యువకుడు ముసలిదంపతుల కుమారుడే ఐవుంటాడని ధీరసింహుడు వెంటనే గ్రహించి, ఆ యువకుణ్ణి పేరుపెట్టి పిలచి, "అబ్బాయీ! నీ తలిదండ్రులు పాపం నీకొసం ఒక్కపెట్టుగా శోకిస్తూవుంటే, నీ విక్కడ విలాసాలతో ఇలా కాలం గడపటం న్యాయమేనా?" అని అడిగే వరకు, యువకునికి తన తలిదండ్రుల సంగతి జ్ఞాపకంవచ్చి, సిగ్గుతో తల వంచుకొన్నాడు.

అప్పుడు ధీరసింహుడు జాలిపుట్టించే మాటలతో ఆ ముసలి తలిదండ్రుల స్థితిని



వర్ణించి చెప్పేవరకు రాజకుమారి మనస్సు కరగిపోయి, యువకుడు తలిదండ్రులను చూచి రావటానికి అనుమతించింది. ధీర సింహుడు యువకుణ్ణి వెంటబెట్టుకువస్తూ, 'అబ్బాయీ! అసలు నీవు ఈ బావిలో ఎందుకు దూకావు?' అని అడిగేవరకు, అతను యిలా చెప్ప నారంభించాడు:

"ఒకనాడు నేను బావిదగ్గర నిలబడి వుండగా, బావిలో దేవతాస్త్రీలు కనిపించారు. అప్పటినుంచీ నాకు పిచ్చెత్తినట్టయి, ఉండ లేక ఒకరోజున అందులో దూకేశాను," అని యువకుడు తన కథ చెప్పగానే, ధీర సింహుడు అతన్ని బయటకు తీసుకువచ్చి, తలిదండ్రులకు వప్పజెప్పాడు. బతికి వచ్చిన కొడుకును కళ్ళారా చూచుకొన్న ఆ తలిదండ్రుల సంతోషానికి మేరలేక పోయింది. వాళ్ళు పుత్రభిక్ష పెట్టిన ధీర సింహుణ్ణి వేనోళ్ళపొగడి దీవించారు.

అక్కడినించి ధీరసింహుడు మళ్లీ తన తోవను తను పోతూవుండగా, ఒక పట్టణం తగిలింది. అక్కడ మాయస్నానాలగదిని గురించి ఎవరిని అడిగినా మాకు తెలియ దంటే మాకు తెలియదన్నారు. కాని, చివరకు ఒక వృద్ధుడుమాత్రం ధీర



సింహుణ్ణిచూచి "నాయనా! ఆ స్నానాల గదివద్దకు వెళ్లినవాడెవ్వడూ తిరిగిరాలేదు. అందుకనే ఆ పట్టపురాజు గదిలోపలకు ఎవ్వరూ పోకుండా కాపలా పెట్టాడు. వృథాగా ఎందుకు ప్రాణాలు పోగొట్టు కుంటావు? నా మాట విని తిరిగిపో" అన్నాడు.

ధీరసింహుడు ఎంతమాత్రము చలించక, చెబితేకాని వీలులేదన్నాడు. అందుచేత, తప్పనిసరి ఐ వృద్ధుడు, ఆ మాయస్నానాలగది ఉండే పట్టణానికి దారి చెప్పాడు. వృద్ధుడు చెప్పిన దోవనే వెళ్ళి, ధీరసింహుడు ఆ పట్టణం చేరుకొన్నాడు.



అప్పటినించీ ధీరసింహుడు రోజుకొక రకపు చిత్రమైన బహుమానాలు తీసుకొని వెళ్లి, రాజకు సమర్పిస్తూ ఉండేవాడు. రాజు చాలా సంతోషించేవాడు.

ఇలా వుండగా, ఒకనాడు రాజు ధీరసింహునితో "ఎప్పుడూ నీవే నాకు ఎన్నెన్నో బహుమతులు ఇస్తున్నావుగాని, నన్ను ఎన్నడూ ఏమీ కోరవేమిటి?" అనేవరకు, "నాకోరిక తప్పక తీరుస్తారా?" అని అడిగాడు ధీరసింహుడు.

అందుకు రాజు "సంశయించక అడగవలిసింది. నా రాజ్యం కావాలన్నా ఇస్తాను. చివరకు నా ప్రాణాలు కోరినా అర్పిస్తాను" అని అభయమిచ్చాడు. ఈ వాగ్దానం తీసుకొని, ధీరసింహుడు "అయితే రాజా! మాయస్నానాగారంలోకి వెళ్లటానికి అనుమతి యిప్పించండి" అని కోరాడు.

పాపం, రాజు చిక్కులో పడ్డాడు. అక్కడికి ధీరసింహుడు వెళ్ళటం రాజుకు సుతరామూ ఇష్టంలేదు. అయినా, మాట తప్పడానికి వీల్లేదు. "నీకీ సలహా ఏ పాపాత్ముడో చెప్పివుంటాడు. ఆ మాయలో పడ్డవాళ్ళెవ్వరూ తిరిగి రాలేదు. కనుక, ఇది తప్పించి మరేదైనా కోరుకో" అని అనేకవిధాల నచ్చజెప్పజూచాడు. కాని ధీరసింహుడు వినలేదు. చేసేదిలేక, దుఃఖిస్తూనే, రాజు చీటీవ్రాసి యిచ్చాడు.

ఆ చీటి తీసుకొని ధీరసింహుడు మాయస్నానాలగదివద్దకు వెళ్ళాడు. ద్వారందగ్గర ఒక పలకమీద "ఈ మాయలోపడ్డ వాళ్ళెవరూ తిరిగిరాలేదు" అని వ్రాసి ఉన్నది. అక్కడ చాలామంది ఫారావాళ్లు కాపలా కాస్తున్నారు. వాళ్లుకూడా ధీరసింహునికి అనేకవిధాల నచ్చజెప్పి చూచారు. కాని, లాభంలేకపోయింది. విధిలేక, వాళ్ళు తలుపులు తెరిచి ధీరసింహుణ్ణి లోపలికి పంపించారు

ధీరసింహుడు లోపలికి వెళ్ళాడో లేదో, తలుపులు దభీమని వాటంతటవే మూసుకున్నై. అతను వెనక్కు తిరిగి చూచేటప్పటికి, తలుపులూ లేవు, గోడలూ లేవు.

మరికొంతదూరం వెళ్ళేసరికి, ఒక మంగలి ఎదురువచ్చి, ధీరసింహుణ్ణి ఒక విశాలమైన గదిలోకి తీసుకుపోయాడు. గది అద్దంలా శుభ్రంగా వుంది. ఆ మంగలి ఒక తొట్టెలో చన్నీళ్ళూ వేడినీళ్ళూ కలిపి, రెండు చెంబుల నీళ్ళు ధీరసింహునికి పోసి, ఒళ్ళు తోమాడు. మూడవ చెంబు నీళ్ళు పోసేసరికల్లా ఢాంమ్మని ఒక పెద్ద శబ్దంపుట్టి, చీకటి కమ్మింది. ధీరసింహుడు కళ్ళుతెరిచి చూచేటప్పటికి మంగలీ, తొట్టె, చెంబూ అన్నీ మాయమైనాయి.

కాని, నీరుమాత్రం అంతకంతకు పొంగిపోయి, ధీరసింహుని గొంతు వరకూ వచ్చింది. ఇదేమిట్రా భగవంతుడా! అని అతను చింతిస్తూవుండగా, గదిపైన కప్పుకి వేలాడుతున్న గొలుసు ఒకటి కంటపడింది. ఒక్కసారిగా



అతను ఎగిరి, ఆ గొలుసు పట్టుకు లాగాడు. వెంటనే మళ్ళీ పెద్ద శబ్దమై, కటికచీకటి కమ్ముకుంది. ధీరసింహుడు కళ్ళు తెరిచేసరికి, ఆ గదీలేదు, నీళ్ళూ లేవు. శుభ్రమైన పాడినేలను అతను నిలబడివున్నాడు.

అక్కడినించి ధీరసింహుడు ఎంత నడిచినా అంతూలేదు, పొంతూ లేదు, అతనికి అమితంగా ఆకలయింది. సమీపంలోనే కొన్ని ఫలవృక్షాలు కనిపించగా, ఆ పళ్ళు కోసుకొని తిన్నాడు. కాని, అవి ఎన్నితిన్నా ఆకలి తీరలేదు.

అలానే ధీరసింహుడు కొంతదూరం పోగా, ఒక మండపం కనిపించింది. ఆ మండపంచుట్టూ వేలకొద్ది రాతివిగ్రహాలు పడివున్నయి. జీవంమాత్రం లేదు కాని, చూడటానికి అవి అచ్చు మనుష్యులలాగానే కనపడుతున్నవి. ఆ మండపానికి ఎదురుగా రాతి అరుగుమీద ఒక ధనుస్సు, బాణాలతో నిండిన అంబుల పొదీ కనిపించినై.

ధీరసింహుడు మెల్లగా ఆ మండపం దగ్గరకు వెళ్ళిచూడగా. దాని కప్పుకి ఒక పంజరం వేలాడివుంది. ఆ పంజరంలో పంచవన్నెల రామచిలుక ఉన్నది. ఆ





సమీపంలో ఒక రాతి పలకమీద ఇలా వ్రాయబడింది:— "పదివందల సంవత్సరాల క్రిందట, శ్రీ హర్షమహారాజు వేటకు వెళ్ళగా, ఆయనకు ఒక కొండదగ్గర అపరూపమైన ఒక జీవమణి దొరికింది. అటువంటి మణి ఈ భూలోకంలో మరెక్కడా లేదు. ఆయన చనిపోయే ముందు, ఆ మణిని ఈ చిలుకచేత మ్రింగించి, చిలుకను ఒక పంజరంలో బంధించి, ఈ మాయస్నానాల గదిని సృష్టించి, చిలుకను స్నానాగారంలో వుంచాడు. ఈ మాయను ఛేదించి మణిని పొందటానికి ఒక్కటే ఉపాయంవుంది. రాతి అరుగుపైన ఉన్న ధనుస్సుకు బాణం ఎక్కుపెట్టి మూడుదెబ్బలలోపల చిలుక ఎడమకన్నుమీద కొట్టాలి. అలా కొట్టలేనివాడు వెంటనే శిలగా మారిపోతాడు."

ఇది చదివి ధీరసింహుడు నాలుగువైపులా పడివున్న రాతి విగ్రహాలు చూచేవరకు, సంగతి అంతా అర్థమైపోయింది. 'ఈ మాయలో పడి, ఆకలి దప్పులతో ఎలాగూ చావక తప్పదుకదా, అయినా అదృష్టం ఎలా వుంటుందో తేల్చుకుందాం అనుకొని, ధీరసింహుడు బాణం ఎక్కుపెట్టి గురిచూసి వదిలాడు. దెబ్బ తగులుతుందనగా చిలుక పక్కకు తప్పుకుంది. వెంటనే ధీరసింహుని ఒళ్లు మోకాళ్లవరకు రాయిగా మారిపోయి, కాళ్ళు లేవలేదు. ఎలాగో శ్రమపడి, రెండవ బాణం వదలగా, అదికూడా తప్పిపోయింది. అందుచేత అతను నడుమువరకు రాయిగా మారిపోయాడు. పట్టు వదలక మూడవసారి అతను బాణం వదిలేసరికి, అది సరాసరి పోయి చిలుక ఎడమకంటికి తగిలింది.

దెబ్బతో చిలుక పంజరంలోనించి బయటకు వచ్చేసింది. వెంటనే మేఘాలు కమ్మి, మెరుపులతో ఉరుములతో అపరిమితంగా వర్షించ నారంభించింది.

మొదట ధీరసింహుడు "ఇంకేముంది, నేనూ రాతి విగ్రహమైపోయా" నను కొన్నాడు. కాని, మరికొంచెం సేపటికే సద్దు మణిగింది. అతను కళ్లు తెరచిచూచే టప్పటికి స్నానాగారమూ, చిలుకా అన్నీ మాయమైనాయి. కొంతదూరంలో మణి మాత్రం ధగధగా మెరిసిపోతున్నది.

ధీరసింహుడు పరుగెత్తుకొనివెళ్ళి, ఆ మణిని తీసుకొని, రాతివిగ్రహాలకు తాకించే సరికి వాటన్నిటికీ మామూలు స్వరూపాలు వచ్చేసి, ఆ మనుష్యులందరూ ధీరసింహుని చుట్టూ మూగారు. ఈనాటికి తమకు ముక్తి కలిగించిన ధీరసింహుణ్ణి వాళ్లు అనేక విధాల పొగడజొచ్చారు. ధీరసింహుడు వీరినందరినీ వెంటబెట్టుకుని వెళ్లి, పట్టపు రాజుతో ఈ సమాచారమంతా చెప్పాడు. ఇది విని రాజుకూడా ధీరసింహుని సాహసానికీ, పట్టుదలకూ, ఉపకారబుద్ధికీ మెచ్చుకుని చాల సంతోషించాడు. ఆ రాజు ధీరసింహునికి అనేకమైన కానుకలిచ్చి, సన్మానించి, అతనివెంట, సులోచనఉండే నగరానికి, తన భటులను తోడిచ్చి పంపాడు.

ధీరసింహుడు వచ్చినట్టు తెలియగానే సులోచన, ఉచితమర్యాదలతో అతన్ని ఆదరించి కూర్చోబెట్టి, అతను చెప్పినదంతా శ్రద్ధతో విన్నది. చివరకు ఆమె "ధీరసింహా! నీవు మాయస్నానాల గదిని గురించి తెలుసు కొనివచ్చిన చిత్రకథ అంతా యదార్థమే. నీవల్ల శాపవిముక్తి పొందినవాళ్ళందరూ నీకీర్తిని దేశదేశాలకు తీసుకుపోయి చెప్పుకొంటున్నారు.

అసలు ఈ మాయను సృష్టించిన పట్టపు రాజునే నీ చాకచక్యంవల్ల మెప్పించ గలిగావు. ఇంతవరకు బాగానేవుంది. నీవు రేపు వచ్చినట్టయితే, ఆఖరుదీ ఐదవదీ అయిన నా ప్రశ్న చెబుతాను" అని ఆమె ధీరసింహుణ్ణి సాగనంపింది. (ఇంకావుంది)






పూర్వం ఓ గ్రామంలో గురవయ్యసెట్టి అనే కోమటి ఉండేవాడు. అతను చాలా తెలివైనవాడు. ఆ తెలివి అంతా ఉపయో గించి ఎంతో డబ్బు సంపాదించాడు. డబ్బు సంపాదనలో ఎన్నో మోసాలూ, అన్యాయాలు చేస్తూ ఉండేవాడు. పరులను అన్యాయం, మోసం చేస్తే పాపం వస్తుందని అతనికి తెలుసు. చేసిన పాపాలు పోగొట్టు కోడానికి కొందరు గుడి కట్టించడమో, ఓ చెఱువు తవ్వించడమో, ఓ సత్రము వేయించడమో, ఇలాటి పుణ్యకార్యాలేవో చేస్తూవుంటారు. కాని 'ఇవన్నీ డబ్బుఖర్చయే పనులే. ఇంతశ్రమపడి, పాపాలు చేసీ డబ్బు సంపాదించడం ఆఖరుకిలా ఖర్చు పెట్టడానికా ?' అనిపించేది గురవయ్యకి. అంచేత అతను ఇలాటి ఖర్చయే పుణ్య కార్యాలేమీ తలపెట్టక, ఊరికే కనపడ్డ దేవుళ్లకీ, కొండలకీ, పుట్టలకీ, చెట్లకీ దణ్ణాలు పెడుతూండేవాడు. ఆ దణ్ణాలతో తన పాపమంతా పోయిందని అనుకునేవాడు.

ఒకనాడు సెట్టిభార్య పాలగిన్నె ఉట్టి మీద పెట్టడం మరిచిపోయింది. ఆవిడ వచ్చేలోపుగా పిల్లి ఒకటి వచ్చి ఆపాలు తాగడం మొదలెట్టింది. సెట్టి పిల్లిని చూచి కోపంతో, దగ్గరున్న అరవీశెరాయి దానిమీద విసిరేశాడు. ఆరాయి దానికి ఆయువుపట్టున తగిలి, అది గిలగిల తన్నుకు చచ్చింది!

ఏదో కోపంతో రాయి విసిరేశాడే గాని ఆ పిల్లి చస్తుందని గురవయ్య అనుకోలేదు. పిల్లి చచ్చిపోయిందనేసరికి అతడు గజగజ వణికిపోయాడు. ఏమంటే, పిల్లిని చంపిన పాపం కాస్తాకూస్తా కాదు. ఆ పాపంవల్ల మళ్లీ జన్మలో కుష్ఠురోగం వస్తుందిట! ఇది చాలా చెడ్డ పాపం గనక ఉత్తుత్తి దణ్ణాలతో పోయేదికాదని తోచి, గురవయ్య ఆ ఊరి శాస్తుల్లుగారితో ఆలోచించటానికి వెళ్లేడు.

పి. సర్వమంగళ



ఎవరి విషయమో మాట్టాడుతోన్నట్లు గురవయ్య ప్రసంగం మొదలెట్టేడు:

"శాస్తుల్లుగారూ, పిల్లిని చంపితే పాపం అంటారు. నిజమేనా ?"

"అందుకు సందేహమేమిటి ? పిల్లిని చంపితే బ్రహ్మహత్యాదోషం చుట్టుకుంటుంది." అన్నాడు శాస్త్రులు.

"ఐతే, ఈ పాపం పోవాలంటే ప్రాయశ్చిత్తమేమిటో?" అని అడిగాడు గురవయ్య.

"ప్రాయశ్చిత్తమా ? ఆ చచ్చిన పిల్లి ఎంత ఉంటే అంత బరువుకి ఓ బంగారపు పిల్లిని చేయించి, బ్రాహ్మడికి దానం ఇస్తే పాపం పోతుంది" అన్నాడు శాస్తుల్లు.

ఆ మాట వినేసరికి గుండె గుభేల్ మన్నది గురవయ్యకి. "శాస్తుల్లుగారూ. ఐతే అందరికీ బంగారపు పిల్లుల్ని చేయించి ఇవ్వగల శక్తి ఉంటుందా ? శక్తిలేనివాళ్ల మాటేమిటి మరి ?" అని అడిగాడు.

"అంత శక్తి లేకపోతే వెండితో చేయించి ఇవ్వవచ్చు" అని ఉపాయం చెప్పాడు శాస్తుల్లు.

"సరే కాని వెండిమాత్రం చవగ్గా ఉందా శాస్తుల్లుగారూ? మరి మార్గం లేదంటారా?" అని అడిగాడు గురవయ్య.

అందుకు శాస్తుల్లు "ఎందుకు లేదూ ? మన పెద్దలు ఎక్కడికక్కడే తాహతుకు సరిపడేటట్టు చెప్పేరు. వెండి పిల్లికి శక్తి లేనివాళ్లు కంచు పిల్లినో, ఆ శక్తీ లేనివాడు ఇత్తడి పిల్లినో చేయించవచ్చు" అన్నాడు.

అక్కడికీ గురవయ్య వదలలేదు. "ఆ శక్తీ లేకపోతే?" అని ప్రశ్న వేశాడు.

"అన్నింటిలోకీ కలిపి స్వల్పమైన దానం స్వయంపాకం" అని తేల్చి చెప్పాడు శాస్తుల్లు.

స్వయంపాకం అంటే ఒకమనిషికి సరిపోయే బియ్యం, పప్పు, ఉప్పు వగైరా సామగ్రి. అన్నీ కలిపి అర్ధరూపాయకన్న




ఎక్కువ ఖర్చవదు. ఈ స్వల్పంతో తాను పిల్లిని చంపినపాపం యావత్తూ పోగొట్టుకో వచ్చునని తెలుసుకున్నప్పుడు గురవయ్య చాలా సంతోషించాడు.

అప్పుడు శాస్త్రుల్లుతో ఆ పాపం చేసింది తానే అని వెల్లడించి, 'ఇంటికి వెళ్ళి స్వయంపాకం పంపిస్తాను. నా పాపం పోగొట్టండి?' అని కోరేడు.

శాస్త్రుల్లు నిర్ఘాంతపోయాడు. "ఇతను బంగారపు పిల్లిబొమ్మ చేయించి దానం ఇవ్వగలిగినంత ధనవంతుడు. స్వయం పాక దానంతో దాటేస్తున్నాడే!" అనుకున్నాడు. మళ్ళీ ఆలోచించి "పోనీ, ఈ మాత్రం ఇచ్చే దాత ఎవడు? ఎక్కడి కక్కడే." అని సిద్ధపడ్డాడు శాస్త్రుల్లు.

గురవయ్య ఇంటివైపు మళ్లేసరికి అతని మనసు మళ్ళీ వెనకడీసింది. "అర్ధ మణుగు చింతపండు అమ్మితే నే గాని, అర్ధరూపాయిరాదు. అలాంటిసొమ్ము ఖర్చు చేసి ఈ బ్రాహ్మడికి దానం ఇవ్వడమా?" అనిపించింది. ఈ ఖర్చుకూడా లేకుండా పాపం పోగొట్టుకోడానికి ఆలోచించాడు.

మళ్లీ శాస్త్రుల్లు దగ్గిరికిగివచ్చి, "ఏం బాబూ, నేను స్వయంపాకం మీకు ఇచ్చుకుంటే, నా పాపం నిజంగా పోతుం దంటారా?" అని అడిగాడు.

అందుకు శాస్త్రుల్లు "ఎందుకు పోదు? నీ పాపం నాకువస్తుంది. ఆపాపం నేను జపంచేసి పోగొట్టుకుంటానులే" అన్నాడు.

ఇదివిని గురవయ్య "అలైతేసరే. నేనిలా పనిమీద వెడుతున్నాను. స్వయంపాకం తర్వాత పంపుతాను. మీరు జపం వెంటనే ఆరంభించండి" అని తనదారిన బయలు దేరాడు.

మరోగంట పోయాక గురవయ్య మళ్ళీ వచ్చి "బాబూ, ఏం చేస్తున్నారు?" అన్నాడు.

"జపం చేస్తున్నాను" అన్నాడుశాస్త్రుల్లు.

"నేను ఇస్తానన్న స్వయంపాకంవల్ల మీకు వచ్చిన నా పాపం పోవటానికేనా బాబూ ఈ జపం?" అని అడిగాడు గురవయ్య.

"ఔను" అన్నాడు శాస్త్రుల్లు.

సెట్టి, సంతోషంతో "ఐతే పిల్లిని చంపిన పాపం తమకు వచ్చిందన్నమాటేనా!" అన్నాడు. గురవయ్య ఇలా ఎందుకు అడుగుతున్నాడో బ్రాహ్మడికి తెలిసిందికాదు. సెట్టి చేసిన పాపం తనకు రాలేదంటే స్వయంపాకం ఎక్కడ పోతుందో అన్న భయంకొద్దీ "వచ్చింది" అని నోటారా అన్నాడుశాస్త్రుల్లు.

"మరైతే వస్తాను. సెలవు" అంటూ గురవయ్య వెళ్ళిపోబోయాడు. "మరి నా స్వయంపాకం ఏదీ?" అన్నాడు శాస్త్రుల్లు.

"స్వయంపాకమా బాబూ? లాబాలు గూబల్లో కొచ్చాయి. మరొకప్పుడు ఇచ్చుకుంటా" అన్నాడు గురవయ్య.

"అదేమిటోయ్, అలాగంటావ్, ఇస్తానని మొదటచెప్పి?" అన్నాడు శాస్త్రుల్లు.

"ఇస్తానన్నమాట నిజమే బాబూ. కాని ఇవ్వలేను. ఏం చెయ్యను మరి? పిల్లిని చంపిన పాపం తమది. స్వయంపాకం ఇస్తానని ఎగ్గొట్టిన పాపం నాది." అంటూ గురవయ్య వెళ్ళిపోయాడు.

"పిల్లిని చంపిన పాపం చాలా ఎక్కువది. స్వయంపాకం ఇవ్వని పాపం చిన్నది. ఇది దేవునికో దణ్ణం పెడితే పోతుంది." అనుకుని, గురవయ్య దారిలో గుడి కనిపిస్తే, ఆగి చెప్పుల జోడులోంచి కాళ్లుతీసి, దేవునికో దణ్ణంపెట్టి, లెంపలు వాయించుకుని, కానీ ఖర్చులేకుండా పాపమంతా పోయిందని సంతోషిస్తో యింటికి వెళ్ళిపోయాడు. సంతోషించి వెళ్ళాడేకాని పిల్లిని చంపిన పాపం ఎలాగా పోలేదు సరికదా, బ్రాహ్మణ్ణి ఆశపెట్టి స్వయంపాకం ఇవ్వకుండా పోయినందుకు ఆ పాపంకూడా వచ్చి చుట్టుకుందన్న సంగతి తెలుసుకోలేక పోయాడు.





# తప్పు చేసిన పిల్ల

పూర్వకాలమందు ఒకానొక కీకారణ్యంలో కొండమీద ఒక మహానుభావుడు తపస్సు చేసుకొంటూ ఉండేవాడు. ఆయన ముక్కు మూసుకుని కేవలము తన మోక్షంకోసమే దేముణ్ణి ధ్యానించే స్వార్థపరుడు కాడు. లోకంలో సమస్త ప్రాణులూ సుఖంగా ఉండటంకోసం ఆయన రాత్రింబవళ్ళు తపస్సు చేసేవాడు. ఇంత గాఢమైన తపస్సులో ఉన్నప్పటికీ ఎప్పుడు ఎవరు వెళ్లి ఆశ్రయించినా జ్ఞానబోధ చేయటమే ఆయనకు ఆనందం.

ఆ అరణ్యం చుట్టుపక్కల సుమారు నూరు గ్రామాల జనులు తపస్వివద్దకు పోయి, వాళ్ళ కష్టసుఖాలు వలపోసుకుని, తరణోపాయం తెలుసుకునేవాళ్లు. అపుడు పుట్టిన శిశువు మొదలుకొని ఆరముగ్గిన వయోవృద్ధు వరకూ, ఎవరికి తగిన సలహాలు వారికి చెప్పి పంపేవాడు తపస్వి. అందుచేతనే అందరకూకూడా ఆయనపైన అపారమైన భక్తి విశ్వాసాలు ఏర్పడినై.

తను నివసించే కొండదిగువను, నలుగురూ నడిచే దారిప్రక్కన ఆయన నాగులు చిత్రమైన సంజ్ఞలు నెలకొల్పాడు. భగవంతుడు ధరించే శంఖు, చక్రం, గద పద్మం— ఇవే ఆ నాలుగు సంజ్ఞలున్ను. వీటిని గురించి తపస్వి ఎంతలేసో అంత రార్థాలుచెప్పి రోజులకొద్దీ బోధించేవాడు. మానవులు పవిత్రంగా ఉన్నంతకాలమూ ఇవి తళతళ మెరుస్తూ ఉండేవి.

వీటిని జనానికి చూపించి, తపస్వి "బిడ్డలారా! ఎల్లప్పుడూ మంచిపనులే చేయండి. నమ్రతగా నడుచుకోండి. సత్యమే పలకండి!" అని చిన్నపిల్లలకు బోధించేవాడు. "ఎవరినీ ద్వేషించకండి. ద్వేషంవల్ల క్రౌర్యం పుట్టుకువస్తుంది. కనుక చాలా జాగ్రత్తగా మసులుకోవాలె"

డి. నాగేశ్వరరావు, బందరు



అంటూ యుక్తవయసులో ఉండేవారికి హితవు చెప్పేవాడు. "అన్నలారా!— మానవులు ప్రశాంతంగా జీవితం గడపటమే పరమేశ్వరుని ఉద్దేశం. ఇందుకు తగిన దోహదం చేయండి. కయ్యానికి కాలు దువ్వటం శ్రేయస్కరం కాదని చేతనైనంతవరకూ ప్రచారం చేయండి" అంటూ వయసు ముదిరిన పెద్దలకు ఉపదేశించేవాడు.

తపస్వి చెప్పినట్టుగా అడుగుతప్పక నడుచుకోవటంవల్ల ఆ నూటగ్రామాల ప్రజలూ ప్రశాంతంగా హాయిగా కాలక్షేపం చేయగలుగుతున్నారు. ఈ ప్రజలూ అందరిలాగానే తప్పులు చేసేవారు. కాని, తపస్వి ఎప్పటికప్పుడు కనిపెట్టి తప్పులను సవరించటంవల్లా, తప్పుచేసినవాళ్ళను మందలించటంవల్లా ప్రజలలో శాంతి ఏర్పడేది. మరొక చిత్రమేమిటంటే, ఎవరైనా ఒక పొరపాటు చేసినప్పుడు వాళ్ళు తపస్వి ఎదట కనబడగానే, దేముని ఎదట చెప్పుకొన్నట్టుగా లెంపలువేసుకొని, 'నేను ఫలానా తప్పు చేశాను' అని వాళ్ళంతట వాళ్ళే చెప్పుకుని పశ్చాత్తాపపడేవారు.

ఇలా ఉండగా ఒకప్పుడు ఒక బాలిక సిగ్గుతో తల వంచుకుని, అడుగులో అడుగు వేసుకుంటూ, ఏడుస్తూ తపస్వి ఎదటికి వచ్చి నిలబడింది. "మీ పవిత్రమైన నాలుగు సంజ్ఞలలోనూ చక్రాన్ని నేను మలినపరిచాను. అపరాధం క్షమించండి," అని దీనంగా వేడుకున్నది.

"ఎలా మలినపరిచావు?" అని చిరునవ్వుతో ప్రశ్నించాడు తపస్వి.

"మహానుభావా! మా ఇంటిపక్కని నాకు నేస్తంగాఉండే ఒక పిల్ల కొత్తగా ఒక పగడపుదండ తెచ్చుకుని మెడలో వేసుకున్నది. నా దండకంటె అపిల్ల వేసుకున్న దండ అందంగా ఉండటంచేత ఆమెపైన

నాకు అసూయ కలిగింది. అందుకని ఆ అమ్మాయినిగురించి నేను లేనిపోని చాడీలు చెప్పాను. ఆ మాటలు ఊరంతటా పాకిపోయి, అందరూ ఆక్షేపించటంవల్ల ఆ పిల్ల పాపం, పైకిరావటానికే సిగ్గుపడి పోతున్నది." అని జరిగిన సంగతి ఉన్నది ఉన్నట్టు చెప్పివేసింది.

తపస్వి ఆమె చెప్పినదంతా శ్రద్ధగావిని, "అయ్యో, ఎంతపని చేశావుతల్లీ! ఒక్క చక్రమే కాదు నీవు మలినపరిచింది. పవిత్రములైన తక్కిన సంజ్ఞలు కూడా మైలపడిపోయినై," అని చెప్పి ఆమెను కొండదిగువకు వెంటబెట్టుకుపోయి ఆ సంజ్ఞలు చూపాడు. అవన్నీ మకిలిపట్టి వుండటం చూచి ఆ బాలిక దుఃఖించి, క్షమించమని ఆయన కాళ్లపైన పడింది.

"సరే, నీవు ఇంటికివెళ్లి రేవు ఉదయమే కొండమీదికి రావలసింది" అని చెప్పి, తపస్వి తన నివాసస్థలానికి వెళ్లిపోయాడు.

మరునాడు ఉదయానే కొండమీద తపస్విఎదట బాలిక చేతులు కట్టుకొని నిలబడివున్నది. ఆయన ఆజ్ఞప్రకారం నూరుగ్రామాల జనమూ కూడా కొండ దిగువను సమావేశమైనారు.



అప్పుడు తపస్వి బాలికను వెంట బెట్టుకుని కొండదిగువకు వచ్చి, ఆ పిల్ల చేసిన తప్పు అందరకూ విప్పి చెప్పాడు. అక్కడనే పక్షిఈకలు గల కట్ట ఒకటిఉన్నది. అందులోని ఒక ఈక తీసి బాలికను ఎగరవేయుమన్నాడు. ఆమె ఎగరవేసేవరకు, అది విమానంవలె గాలిలో ఎగిరి, మరి కనపడకుండాపోయింది. అదే మోస్తరుగా ఆ కట్టలోని ఈకలన్నిటినీ ఎగురవేయించాడు. ఈకలన్నీ ఒక్కటీ కనపడకుండా మాయమైపోయినై.

తర్వాత, అక్కడ మూగిన అందరి తోనూ "ఆ అమ్మాయి ఎగురవేసిన

ఈకలను ఎలాఅయినా శ్రమపడి పోగుచేసి తీసుకురమ్మని ఆజ్ఞాపించాడు. ఒకొక్క ఈకకు ఇంత చొప్పున బహుమతికూడ ఇస్తానన్నాడు.

అందరూ బహుమతిపొందాలనే ఆశతో ఈకలు వెతుకబోయారు. ఎంత దూరం తిరిగినా ఎగిరిపోయిన ఈకలన్నీ దొరకనే లేదు. వెళ్ళిన వేలాది జనంలో ఒక్క నలుగురుమాత్రం ఒక్కొక్కటి చొప్పున తీసుకు రాగలిగారు.

వాటిని ఆ తపస్వి తీసుకుని కట్టకట్టి, బాలికచేతికి ఇచ్చి "అమ్మాయీ! ఏ బాలికమీదనైతే నీవు చాడీలు చెప్పావో, ఆ బాలికకు ఈ కట్ట ఇచ్చి, 'చెల్లీ! మన్నించు. నీలోని నాలుగు మంచి గుణాలను నేను దొంగిలించాను. ఇప్పుడు మళ్ళీ వాటిని నీకు ఇచ్చివేస్తున్నాను. పుచ్చుకో!' అను. ఆమె ఏమంటుందో మళ్ళీవచ్చి నాతో చెప్పు" అన్నాడు.

తపస్వి చెప్పినట్టే చేసి, ఆ బాలిక తిరిగివచ్చి "మహానుభావా! నా నేస్తం ఆ కట్ట తీసుకొని ఏమీ బదులుచెప్పలేదు. నవ్వి ఊరకున్నది" అని చెప్పేవరకు, "ఈసారి సంజ్ఞలు చూడు" అన్నాడు తపస్వి.

ఆ బాలిక, ఆమెతోపాటు నూరుగ్రామాల ప్రజలు చూస్తూవుండగా, అందరకూ ఆశ్చర్యం కలిగేటట్టు ఆ నాలుగు సంజ్ఞలపై నున్న మకిలి వదిలిపోయి, తిరుగా అవి తళతళ మెరవవొచ్చాయి.

అప్పుడు అందరకూ తపస్వి చేసిన పనిలోని అంతరార్థం బోధపడింది. అబద్ధాలు చెప్పటం ఎంత సులువో, అవి పక్షి ఈకలవలె ఎంత త్వరగా గాలిలో వ్యాపిస్తాయో, ఎగిరిపోయి అలా వ్యాపించిన వాటిని మళ్ళీ కూడగట్టుకువచ్చి తుద ముట్టించాలెనంటే అది ఎంత కష్టసాధ్య మైన కార్యమో, అందరకూ తెలిసివచ్చింది.






అనగనగా ఒక దేశంలో ఇద్దరు అన్నాదమ్ములు ఉండేవాళ్ళు. అన్న యుక్తిపరుడు, జిత్తులమారిన్ని. తమ్ముడు సాధుశీలుడూ, సత్యకాలపువాడున్ను.

యుక్తులచేత, మాయోపాయాలచేత అన్న కోకొల్లలుగా డబ్బు గడించి, ధనవంతుడైనాడు. ఆ డబ్బుతో అతను ఒక దివ్యభవనం కట్టించాడు. భార్యకు విలువైన నగలు చేయించాడు. మంచి మంచి దుస్తులు కొన్నాడు. సమస్తమైన ఐశ్వర్యాలూ అనుభవిస్తున్నాడు. ఐశ్వర్యంతోపాటే అనేకమంది ఆశ్రితులు చేరుకుని, వందిమాగధులవలె అతన్ని పొగడనారంభించారు. ఈ విధంగా, సిరి పట్టినప్పటినించీ, అతను పట్టిందల్లా బంగారమూ, ముట్టిందల్లా ముత్యమూ కాజొచ్చింది. పోతే, తమ్ముని సంగతంతా తారుమారైంది. పంటలా నాశనమైనాయి. దొమ్మరోగం వచ్చి పశువులు చచ్చినై. ఈయవలసిన బాకీలు తప్పలేదు, రావలసినవి రాలేదు. అందుచేత అప్పులవాళ్ళ పీడ మిక్కుటమైంది. ఏదీ కలిసిరాక, కాసుకి గతిలేక తనూ, భార్యా పిల్లలూ కడుపులో కాళ్ళుపెట్టుకుని రోజులకు రోజులు పస్తు పడుకోవలసివచ్చింది.

ఈ దరిద్రబాధ పడలేక ఒకనాడు అతని భార్య "మీ అన్నకు బోలెడంత భాగ్యముంది. ఒక్కసారిపోయి, మనస్థితిగతులు చెప్పండి. ఏమైనా సాయంచేస్తాడు. ఎవరినీ ఏమీ అడక్కపోతే ఎలా గడుస్తుంది? అడగందీ అమ్మైనా పెట్టదుకదా! ప్రాణాలు నిలవటంలేదు. పోయిరండి" అంటూ పోరుపెట్టింది.

ఇలా ఆమె నాలుగైదుసార్లు వేధించేవరకు, "సరే, పోయివద్దాం. సోదరుడు ఏమీ సాయంచేయక పోతాడా" అని నమ్మి

చాపలి ఇందిరకుమారి, బెజవాడ



చిన్నవాడు ఆరోజే అన్నవద్దకు బయల్దేరి వెళ్ళాడు.

అతని గోడు అంతా విని, "చూడు తమ్ముడూ! రేపులేదు. ఎల్లుండి గురువారం నాడు నా పుట్టినరోజు పండుగ. మరదలినీ పిల్లలనూ వెంటబెట్టుకుని, నీవు తప్పక రావాలి సుమా!" అని ఆప్యాయంగా పిలిచాడు అన్నగారు.

తమ్ముడు ఎంతో ఆశతో ఇంటికి వచ్చి, ఈ సంగతి భార్యతో చెప్పేసరికి, ఆమె కూడా సంతోషించింది. గురువారంనాడు అన్నగారు తనకేదో గొప్ప బహుమతులు ఇస్తాడు, ఈ దెబ్బతో కుటుంబ దరిద్రం తీరిపోతుంది అని తమ్ముడు లొట్టలు వేస్తున్నాడు.

గురువారం తెల్లవారగట్టే లేచి, తమకు ఉన్న చింకిబట్టలే వేసుకుని, నాలుగామడ నడిచిపోయి, అన్న ఉండే పట్టణం చేరుకున్నారు తమ్ముడూ, కుటుంబమున్నూ. వీళ్ళు పోయేసరికల్లా అన్నగారి భవనం కలకల్లాడుతూవుంది. దేశదేశాలనుంచి లక్షాధికారులూ, కోటీశ్వరులూ వచ్చారు విందుకి. ఆ శ్రీమంతులందరూ చక్కా బారులుతీర్చి కుర్చీలలో కూర్చున్నారు. వారందరకూ మేజాలపైన ఫలహారాలు, పానీయాలూ పొందికగా అమర్చబడి వున్నాయి.

తినేవాళ్ళు తింటున్నారు, తాగేవాళ్ళు తాగుతున్నారు. పొట్టలు ఉబికేటట్టు దట్టించినప్పటికీ, "మరొక్క లడ్డు వేయించుకోండి, మరికొంచెం పాయసం వేయనీయండి" అంటూ అన్నగారు ఆ శ్రీమంతుల నందరినీ ఇంకా బలవంత పెట్టసాగాడు. ఇలా వందలూ వేలూ జనం వచ్చి విందు ఆరగించి, గ్రుమని తేనుస్తూ తాంబూలాలు సేవించారు. కాని, ఒక్కళ్ళూ తమ్ముని వేపు కన్నెత్తి చూడనేలేదు. అందు

చేత, అందరూ తింటూవుంటే అతనూ కుటుంబమూ చూస్తూ కూర్చోవటమేకాని, కణమైనా కొరికిన పాపాన పోలేదు.

విందు పూర్తికాగానే, బ్రహ్మాండమైన సభ జరిగింది. ఆ సభలో, అన్నగారి వైభవాన్ని గురించీ ఐశ్వర్యాన్ని గురించీ మెచ్చుకొంటూ శ్రీమంతులందరూ ఉపన్యాసాలు చేశారు, కీర్తనలు పాడారు.

విందు పూర్తి అయింది. ఎవరి దారిన వాళ్ళు సెలవు తీసుకొని ఇళ్ళకు బయలుదేరారు. అప్పటివరకుకూడా అన్న, తమ్ముని వంక చూడనయినాలేదు. తమ్ముడు కుటుంబంతోసహా వచ్చినసంగతి తనకు తెలియనట్టే అతను ఇంట్లోకి వెళ్లిపోయాడు.

ఇలా అవమానం పొంది తమ్ముడు తన భార్యా పిల్లలతో తిరిగి తన యింటికి వట్టిచేతులతోనే బయలుదేరాడు. దారిలో అతను యాధాలాపంగా, విందులో పాడిన పాట పాడుతూ నడవసాగాడు. ఎప్పుడైతే అతను పాడటం మొదలుపెట్టాడో మరో గొంతుకూడా అతని పాటతోపాటు కలిసి పాడుతున్నట్టు వినిపించింది. మొదట అతను ఆ పాడుతున్నది తన భార్యయే



నేమో అనుకుని "నీవేనా నాతో కలిసి పాడుతున్నది?" అని ఆమెను అడిగాడు.

"నేనేమీ పాడలేదు. అయినా యింత పరాభవం పొందికూడా పాట పాడేటంత సిగ్గుమాలినదాన్ని కాదు." అన్నది.

ఇంతలో అప్రక్కని చెట్లమరుగులోంచి— "నీతోపాటు పాడింది నేనే నయ్యా. నేను దరిద్ర దామోదరుణ్ణి. ఎన్నాళ్లనించో కాచుకుని వున్నాను. ఎవరు దొరుకుతారా స్నేహానికి అని. ఇవాళ నువ్వు దొరికావు నిన్ను వదిలేదిలేదు. నన్నుకూడా నీతో తీసుకుపో" అని వినిపించింది.



ఆ మరుక్షణమే ఒక మరుగుజ్జు వాళ్ళ ఎదట ప్రత్యక్షమయ్యాడు.

తమ్ముడూ, కుటుంబమూ, దరిద్ర దామోదరుడూ కలిసి, వాళ్ళ ఇంటికి చేరుకొన్నారు.

ఇంటికి చేరుకున్నతరువాత దరిద్ర దామోదరుడు "తమ్ముడూ! తాగివచ్చి తందనాలాడుదాము. ఎప్పుడూ విచారంగా ఉంటావేమిటి? పోదాం, పద" అని ప్రోత్సహించాడు.

"నాకు డబ్బులేదు" అన్నాడుతమ్ముడు.

"డబ్బు లేకపోవడమేమిటి? నీ పైమీది చొక్కా ఉండగా మనకు ఏం తక్కువ? అమ్మివేదాం పద" అంటూ అతన్ని తీసుకపోయాడు.

ఈ విధంగా దరిద్ర దామోదరుని ప్రోద్బలంవల్ల, రోజుకొకటి చొప్పున ఇంట్లో వుండే సరకూ సప్పరా పట్టుకపోయి అమ్మి, తమ్ముడు తాగివేశాడు. చివరకు తమ్ముని భార్యకు ఒంటిమీద రెండు చింకి చీరలు మాత్రం మిగిలినై. "నీ భార్యకు రెండు చీరలెందుకయ్యా? అందులో ఒకటి తీసుకురా?" అని దరిద్ర దామోదరుడు తమ్ముణ్ణి ఉసికొలిపి తీసుకపోయినాడు. అదికూడా అమ్ముకొని తాగివేసేవరకు ఇంట్లో ఏమీ మిగులలేదు. తరువాత, దామోదరుని మాయవల్ల తమ్ముడు, పొరుగున ఉండే ఒక ధనికునివద్దకు పోయి, "అయ్యా! మీ బండీ ఎద్దులూ ఒకసారి నాకు యిప్పించండి. మళ్ళీ రేపు తీసుకవచ్చి ఒప్పగించివేస్తాను" అని కోరగా, ధనికుడు లేదనకుండా ఇచ్చాడు.

బండి ఇంటికి రాగానే, దరిద్ర దామోదరుడు "తమ్ముడూ! ఇక్కడికి తూర్పుదిక్కున నాలుగామడ దూరంలో, తాటితోపు పక్కన ఉండే నల్లపాషాణం ఎరుగుదువా?" అని అడిగాడు. "ఓఁ,

చాకేమిటి. నల్లపాషాణం తెలియకపోవడ మేమిటి?" అంటూ సగర్వంగా ఎదురు ప్రశ్న వేశాడు తమ్ముడు.

"మరైతే, బండీ అక్కడికి తోలుకు పద!" అన్నాడు దామోదరుడు.

దామోదరుని మహిమవల్ల తమ్ముడు ఆ బ్రహ్మాండమైన నల్లపాషాణం ఎత్తేటప్పటికి, ఒక రంధ్రం అగుపించింది. ఆ రంధ్ర ద్వారా పోయి, తళతళలాడే బంగారపు ముక్కలూ, మిలమిల మెరిసే నవ రత్నాలూ, ఒక్కటీ ఒదిలిపెట్టకుండా పట్టుకువచ్చి బండిలో ఎక్కించుమన్నాడు దామోదరుడు. అతను చెప్పినట్టల్లా శ్రమ పడి చేస్తూనేవున్నాడు తమ్ముడు, మంచి మనస్సుతో.

ఎంత చురుకుగా పని చేస్తూవున్నా, దామోదరుడు "రా. రా. తాగటానికి వేళ మించిపోతూంది" అంటూ కంగారుపెట్ట సాగాడు.

"ఈ దుర్మార్గుడు ఇంతవరకు నన్ను కవరంచేసి వదిలాడు. ఇప్పుడైనా బుద్ధి తెచ్చుకుని తాగుడు మానితేతప్ప ఇక బాగుపడేమార్గం కనపడదు. కానైతే ఇప్పుడింకా 'తాగుడుకు పోదాం, ర'మ్మని



తొందరచేస్తూనేవున్నాడు. కనుక ఏదైనా ఉపాయంచేత వీని పీడ వదిలించుకోవాలి" అని నిశ్చయించుకొన్నాడు, తమ్ముడు.

ఈ ఉద్దేశంతో అతను దరిద్ర దామో దరునితో "ఓయి, అన్నా! ఇంతా కష్టపడి వచ్చి, ధనం వదిలేస్తే సార్థక మేమున్నది? నీవుపోయి ఒక్కటీ మిగలకుండా ఒక్క సారి చూచిరా" అనేవరకు దామోదరుడు గోతిలోకి జర్రున జారాడు. వెంటనే తమ్ముడు టపీమని నల్లపాషాణం దొర్లించి రంధ్రం మూసి వేశాడు. చేసేదిలేక, దామోదరుడు దేముడా అంటూ గోతిలో కప్పడిపోయాడు.



దరిద్ర దామోదరుణ్ణి బిలంలో బంధించి వేశాక తమ్ముడు బంగారము, నవరత్నాలు నింపుకొన్న బండితో ఇల్లు చేరుకున్నాడు. బదులుతెచ్చిన బండీ ఎద్దులూ ధనికునికి ఇచ్చేశాడు. రాజుగారి కోటను మించిన ఒక సుందరమైన భవనం కట్టించుకొన్నాడు. భార్యకు కోరినన్ని నగలు చేయించాడు. పాడి పంటలకూ, సిరి సంపదలకూ కాస్తంతైనా లోటు లేకుండా అన్నకంటె ఎక్కువ వైభవంతో వెలిగిపోతున్నాడు.

ఇలా ఉండగా తమ్ముని పుట్టినరోజు వచ్చింది. మునుపంటే దరిద్రుడు గనుక ఇంట్లో కథా, కార్యమూ తలపెట్టటానికి తాహతు లేకపోయింది. కాని, యిప్పుడతనికేం లోటు? అతను తలుచుకుంటే కొండమీది కోతి దిగివస్తుందన్న మాట. అందుచేత అన్నగారివలెనే తనుకూడా పుట్టినరోజు పండగ చేసుకోవాలని కుతూహలం కలిగింది తమ్మునికి.

తమ్ముడు వెళ్ళి అందరితోపాటు అన్నగారినీ కుటుంబాన్నీ ఫలానారోజున రమ్మని పిలిచాడు. అమిత ఆశ్చర్యంతో అన్న ఆ రోజున బయల్దేరి వెళ్ళేవరకు, మామూలు చోట తమ్ముని పూరిగుడిసె కనబడలేదు. అతన్నిగురించి భోగట్టాచేయగా, ఆ వూరివారు తమ్ముడు ఉండే దివ్యభవనానికి దారిచూపించారు. తనను మించిన తమ్ముని ఐశ్వర్యం చూచి అన్నగారూ, కుటుంబమూ 'ఔరా, ఇంతలో వీడికి ఇంత సిరి ఎలా పట్టిందా' అని ముక్కుమీద వేలు వేసుకొన్నారు.

ఆ రోజున తమ్ముని ఇంటికి దేశదేశాల నుంచి అతిధులు వచ్చారు. అపూర్వమైన విందు జరిగింది. తమ్ముని కీర్తి మోగిపోయింది. ఇదంతా చూడగా, అన్నగారికి పట్టరాని అసూయ బయల్దేరింది. అతను ఎలాగో సాయంత్రంవరకూ ఉండి

అందరూ వెళ్ళిపోయినతరువాత తమ్ముణ్ణి అనేకవిధాల పొగడి, 'ఈ సంపద అంతా ఎలా వచ్చింది తమ్ముడూ ?' అని ఆత్రంతో అడిగాడు.

తమ్ముడు తనను దరిద్ర దామోదరుడు అపహించటం, తాటితోపు దగ్గర నల్ల పాషాణంకింద వున్న ధనం తన బండిలో వేయించటం, మొదలైన సంగతులన్నీ మాయా మర్మం లేకుండా పూసగుచ్చినట్టు చెప్పాడు. ఈ రహస్యం తెలియగానే అన్న ఒక్క క్షణమైనా నిలువక, "సరే ఉండు, నీ పని పట్టిస్తాను. నాకంటె ఎక్కువ సిరితో తులతూగడం ఏమిటో చూస్తాను" అని మనస్సులో అనుకుని తమ్ముడిదగ్గర సెలవు తీసుకుని తిరిగి యింటికి చేరుకున్నాడు.

నల్లపాషాణంకింద ధనం ఉన్నట్టు తెలుసుకున్న అన్నగారు మరునాడు ఉదయానే బయల్దేరి తాటితోపువద్దకు చేరుకుని, మెల్లిగా పాషాణం ఎత్తి నిజమో కాదోనని తొంగి చూడబోయినాడు. ఎంత యత్నించినా దానిని ఎత్తటానికి అతని వల్లకాలేదు. కాని, కొంచెం తెరిచేసరికల్లా ఉగ్రుడైవున్న దరిద్ర దామోదరుడు ఆ సందులోనుంచి



చేయిదూర్చి అతని పీక పట్టుకొని నులిమి వేయజొచ్చాడు.

అప్పుడు అన్న ఉక్కిరిబిక్కిరి ఐపోయి, "దామోదరా! దామోదరా!! నే నెవరిననుకొంటున్నావో! నిన్ను ఈ గండిలో బంధించినవాడు నా తమ్ముడు, కాని నేను కాదుసుమా! ఇద్దరమూ ఒకే పోలికగా ఉండటంచేత నన్నుచూచి వాడే అనుకుంటున్నావు కాబోలు. నన్ను విడిచిపెట్టి వేసెయ్యి" అంటూ గోలపెట్టాడు.

"పోవోయ్ మోసగాడా! ఇదివరకు చేసింది చాలక ఇంకా ఇప్పుడుకూడా దగా చేయటానికని వచ్చావా? నీ దొంగమాటలు

ఎవరు నమ్మతారనుకున్నావు?" అని గద్దించాడు దరిద్ర దామోదరుడు.

'నిజానికి నే నిప్పుడు నిన్ను ఈ బంధం నుంచి విడిపించటానికే వచ్చాను. నా మాట నమ్ము దామోదరా!' అని కాళ్ళా వేళ్ళా పడేవరకు, దామోదరుడు "సరే, పద. ఇంటికి పోదాం" అంటూ అతని జుట్టు కళ్లెంగా పట్టుకుని బుజాలమీద ఎక్కికూచ్చుని, ఇంటికి చేరుకొన్నాడు.

ఇంటికి వెళ్ళినప్పటినించీ దరిద్ర దామోదరుడు తన మామూలు మాయలను అన్నపైన ప్రయోగించి, అతనికి తాగుడు మప్పి తమ్మునివలెనే ఫకీరుచేసి వదిలాడు. తను ఇంత దరిద్రస్థితికి వచ్చినా దామోదరుని పీడ వదిలే మార్గం కనపడలేదు.

అప్పుడు అన్న దాగుడుమూతా లాడుకుందాం అని మిష పెట్టి మెల్లగా ఒక బండిచక్రపుఖాళీలో వాడు ఇరుక్కునేటట్టు యుక్తిచేసి, మళ్ళీ ఎన్నడూ ఇవతలకు రాలేకుండా కొయ్యలు బిగించి బంధించి వేశాడు. అంతేకాదు. ఆ చక్రాన్ని అతను దేముడా అంటూ మోసుకుపోయి, దూరాన ఉండే ఒక నదిలో వదిలిపెట్టాడు. ఆ చక్రం నదిమీద అలా అలా కొట్టుకుపోయి, నదిసముద్రం చేరుకొన్నది.

సముద్రంలో తేలి అడుతూవున్న ఆ బండి చక్రాన్ని అలా ఉండనిస్తే బాగుండిపోను. దరిద్ర దామోదరుడికి తిండి తిప్పలు లేక పస్తుండి చచ్చిపోతే ప్రపంచానికి వాడి పీడ విరగడైపోను.

కాని, ఎవడో ఆశపోతు రాముడు ఒకనాడు ఆ చక్రాన్ని చూచాడట. తేరగా దొరికిందికదా అనితలిచి, శ్రమపడి దాన్ని ఒడ్డుకి లాక్కునివచ్చి, అన్న దిగగొట్టిన శీలలు విడకొట్టేవరకు దరిద్ర దామోదరుడు మళ్ళీ భూలోకింలో ప్రవేశించి, ఇష్టం వచ్చినట్టు ప్రజల నందరినీ పీడిస్తున్నాడు.






ఒక అడవి ఉంది. ఆ అడవిలో ఒక పెద్ద కోనేరు, కోనేటి ఒడ్డున ఒక పెద్ద మఱ్ఱిచెట్టు వుంది. ఆ చెట్టుక్రిందకు ఒక కుష్ఠువాడు నడిచివచ్చి, ఆయాసం తీర్చుకోటానికి ఆ నీడను కూర్చున్నాడు. కూర్చుని యధాలాభంగా చెఱువుకేసి చూశాడు. అతడలా చూస్తోండగానే, ఆ చెట్టునుంచి ఆకొకటి రాలి చెఱువులో పడింది. పడీ పడ్డంతోటే అది ఒక చేపగా మారిపోయి బుడుంగుమని నీటిలో మునిగిపోయింది.

ఆకు చేప అయిపోవటంచూచి అతను ఆశ్చర్యపడుతూవుంటే మరో ఆకు రాలింది. ఆఆకు నీటిలోకాకుండాగట్టుమీద పడింది. పడీ పడ్డంతోటే అది ఒక పిట్టగా మారిపోయి, తుఱ్ఱుమని పైకెగిరిపోయింది! ఇది మరీ ఆశ్చర్యంగా తోచిందతనికి.

ఇంతలో ఇంకో ఆకు రాలింది. ఈ మాటు రాలిన ఆకు పూర్తిగా చెఱువులోనూ పడలేదు, పూర్తిగా ఒడ్డునా పడలేదు; సగం నీటిలోనూ, సగం ఒడ్డునా పడింది. నీటిలోపడ్డ సగం చేప అయింది! ఒడ్డున పడ్డ సగం పక్షిఅయింది.

చేపగా మారిన భాగం నీటిలోకి పారిపోదామని అటు లాగింది. పక్షిగా మారిన భాగం పైకి ఎగిరిపోదామని ఇటువైపు లాగింది. కుష్ఠువాడు, లేచివెళ్ళి, ఆ చోద్యం చూట్టం మొదలెట్టేవరకు అది ఒక పెద్ద భూతంగా మారిపోయింది. నెత్తిమీద మేకులకు మల్లే నిటారుగా నిలబడి ఉన్న బిరుసు వెంట్రుకలు, చింతనిప్పులకు మల్లే ఎఱ్ఱగా కణకణ లాడుతూ వుండే కళ్లూ, వాడి కోరలూ, గూనినడ్డీ, బాన కడుపూ గల ఆ భూతం, భయంతో వణికి పోతూ నోట మాటలేకుండా నిలబడ్డ ఆ కుష్ఠువాణ్ణి అమాంతం ఎత్తి బుజంమీద వేసుకుని గబగబా పారిపోయింది.

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మద్రాసు



భూతం అలా వెళ్ళివెళ్ళి ఒక గుహ దగ్గిర ఆగింది. ఆ గుహ ద్వారం ఒక పెద్ద బండరాయితో మూసేసి ఉంది. భూతం ఆరాయిని సునాయాసంగా పక్కకు ఒత్తిగించి లోపల ప్రవేశించింది. బుజం మీద మోసుకొచ్చిన కుష్ఠువాణ్ణి నేలమీద పడేసి, అక్కడ తా నంతకుముందు ఇలాగే తెచ్చి పడేసి ఉంచిన మనుష్యుల నందరినీ ఒక్కమాటు లెక్కపెట్టుకుంది. కుష్ఠువానితో కలిపి వాళ్లు నూరుమందయారు. అప్పుడా భూతానికి కలిగిన సంతోషం ఏమని చెప్పం? ఎప్పుడు దొరికన మనిషి నప్పుడు తినెయ్యదాభూతం. అలా తినేస్తే దానికి కడుపునిండినట్టే ఉండదు. నూరు మందయేదాకా ఊరుకుని, ఆవేళ వాళ్ళ నందర్నీ దొంతరపెట్టి తినేసి, ఆ చెఱువులో ఉన్న నీళ్ళు తాగి, కొన్నాళ్ళపాటు ఆ గుహలో నిద్రపోతుంది.

ఈవేళ కుష్ఠువానితో నూరుగు రయారు గనక కడుపునిండా భోజనం దొరికిందన్న సంతోషంతో ఒక్కమాటు ఎగిరి గంతేసింది. చెఱువుకెళ్ళి స్నానంచేసి వచ్చి మింగే దామని తలిచి బయల్దేరింది.

గుహలో అంతకుముందు పడిఉన్న తొంభై తొమ్మండుగురూ ఆ కుష్ఠువాణ్ణి చూచి, "నాయనా, నీతో నూరుగురం అయాం. నేటితో మనకి నూరేళ్లు నిండేయి" అని గొల్లుమంటూ ఏడవటం మొదలెట్టేరు.

"ఈ భూతాన్ని చంపేసే ఉపాయ మేమీ లేదా?" అన్నాడు కుష్ఠువాడు.

"ఈ భూతాన్ని చంపాలంటే కేవలం ఆ పరమశివుడో లేకపోతే అలాంటి మరో దేవుడో రావలసిందే గాని మనుష్య మాత్రులం మనం ఏంచెయ్యగలం?" అన్నారు వాళ్లు.

కుష్ఠువాడు, "శివుడికి వినిపించేటట్లు నేను స్తోత్రం చేయగలను గాని, వినిపించి

తూడా ఆయన రాడేమో? నేనంటే ఆయనకి కోపం" అన్నాడు.

"నీ మీద శివునికి కోపం ఎందు కొచ్చింది?" అని వాళ్ళలో ఒకడు అడిగేడు.

'ఆ కథ అంతా చెబుతూ కూచుంటే భూతంవచ్చి మనని మింగేస్తుంది. ముందు ఆ భూతాన్ని చంపేమార్గం చూడాలి. భూతం చచ్చిపోయాక ఎన్ని కథలైనా చెప్పుకోవచ్చు' అంటూ, కుష్ఠువాడు శివుని కుమారుడైన కుమారస్వామిని భక్తితో స్తోత్రం చేసేవరకు ఆ దేవుడు ప్రత్యక్షమై, "ఎందుకు నన్ను రప్పించావు?" అని అడిగేడు.



అప్పటికప్పుడే భూతం స్నానంచేసేసి, గుహకి తిరిగి వచ్చింది.

కుష్ఠువాడు కుమారస్వామికి మ్రొక్కి, "స్వామీ, మొదట యీ భూతాన్ని చంపేసి మమ్మల్ని కాపాడు" అని కోరేసరికల్లా కుమారస్వామి తన ఆయుధంతో ఆ భూతాన్ని ఒక్క దెబ్బకు నరికిపారేశాడు.

కుమారస్వామి కుష్ఠువానివైపు చూసి, "ఏమయ్యా, నువ్వు గొప్ప కవిలాగా ఉన్నావే. కవులు తప్ప ఇంత చక్కటి శ్లోకాలు మరెవరు చెప్పగలరు? మరి, నీకి కుష్ఠురోగం ఎలా వచ్చింది" అని అడిగే టప్పటికి కుష్ఠువాడు, "స్వామీ, మీ తండ్రి పరమేశ్వరుడి శాపంవల్లనే నా కీ రోగం వచ్చింది అని చెప్పాడు.

"భూతం చచ్చిపోయింది గనక ఆ కథంతా ఇప్పుడు సావకాశంగా చెప్పు" అని గుహలో వాళ్ళంతా ఆ కవీశ్వరుణ్ణి కోరేరు.

కుమారస్వామికూడా వింటూంటే అతను తనకథ ప్రారంభించాడు:

"మాది పాండ్యరాజ్యం. నా పేరు నక్కీరుడు. మధురలో పాండ్యరాజు ఆస్థానంలో రత్నాలపీఠం ఒకటి ఉంది.



సరస్వతీదేవితో సమానమైన కవీశ్వరులు కూచోటం కోసమని ఆ పీఠాన్ని అగస్త్య మహాముని పాండ్యరాజుకి ఇచ్చాడు. ఆ పీఠం ఒక్క కవి కూచోటానికి సరిపోతుంది. కాని చిత్రమేమిటంటే గొప్ప కవులెందరొచ్చినా అది విస్తరించి కూచోటానికి చోటిస్తుంది.

"నేను పాండ్యరాజు సభలోకి వెళ్ళేటప్పటికి ఆ పీఠం అప్పటికప్పుడే పదకొండుగురు మహాకవీశ్వరులకు చోటిచ్చింది. నేను నా కవిత్వంతో అందరనూ మెప్పించాను. చటుక్కున ఆపీఠం పెరిగి నాకూ చోటు యిచ్చింది. నా తర్వాత కూడా చాలా మంది కవులు పాండ్యరాజు సభకు వచ్చి కవిత్వం చెపుతూండేవారు. వాళ్లెవరికీ ఆ పీఠం చోటివ్వలేదు. రాజు వాళ్ళ నెవళ్ళనీ ఉత్తిచేతులతో పంపేవాడుకాడు. ఆ పీఠం మీద కూర్చుని 'గొప్ప కవులం' అనిపించుకున్న మేము పన్నెండుగురం అక్కడికి వచ్చిన ఒక్కొక్క కవినే పరీక్షచేసి శిఫార్సు చేశాక ఆ శిఫార్సుప్రకారం కానుకలిచ్చి పంపేవాడు. క్రమక్రమంగా సభకి కవులు రావటం తగ్గిపోయింది. దానికి కారణం ఆ పీఠంలో తమకు చోటు దొరకదనే మాటెలా ఉన్నా, వారు మా ముందువచ్చి నిలపడడానికే భయపడేవారు. దానితో మాకందరికీ గర్వం. అహంకారం ఎక్కువైపోయినై. ముఖ్యంగా నాకు మరిన్నీ.

"ఒకనాడు కవినంటూ ఒకడు రాజసభకు వచ్చి, ఒక పద్యం చదివేడు. ఆ పద్యంలో 'ఒక స్త్రీయొక్క జుట్టుముడి సహజమైన సువాసనతో ఉన్నద'ంటూ చెప్పేడు. నేను నవ్వుతో "ఇదేం కవిత్వమయ్యా? ఎక్కడైనా జుట్టుముడికి సహజమైన సువాసన ఉంటుందా? ఏ వాసన నూనో రాసుకుందికాబోలు!" అని ఎగతాళి చేశాను. దానితో వాడు కిక్కురుమనకుండా



సభలోంచి అవతలకు పోయాడు. 'మంచి బాగా చివాట్లుపెట్టి పంపించేశావయ్యా' నత్కీరా, అని తక్కిన పదకొండుగురూ నన్ను మెచ్చుకున్నారు.

"ఇంతలో సభలోంచి పోయినవాణ్ణి వెంటబెట్టుకుని మరొకాయన కోపంతో ప్రవేశించి "ఇతడు నా భక్తుడు. తిండికిలేక బాధపడుతోంటే ఒకపద్యం రాసిచ్చి,దాన్ని తీసుకెళ్లి రాజ సభలో చదివి బహుమానం తెచ్చుకోమనగా, ఇత నిక్కడికొచ్చి అ పద్యం చదివితే ఎవడో దానిలో తప్పు పట్టే డుట! ఎవడు వాడు?" అని గద్దించి అడి గేడు. 'నేనే' అంటూ మీసంమీద చెయ్యి వేసి నిలబడి "జుట్టుముడికి సహజమైన సువాసన ఉంటుందా ఏ స్త్రీకైనా?" అన్నాను. అందుకాయన 'నీకు తెలియ దేమోగాని అలాంటి స్త్రీ ఒకామె ఉంది. నా భార్య ఐన పార్వతీదేవి కేశములు సహజ పరిమళం కలవి. తెలియకపోతే తెలియనట్టుగా ఊరుకోవాలిగాని ప్రతివానికీ తప్పులు వెతకటం సత్కవుల లక్షణం కాదు' అంటూ ఆయన తన నిజరూపంలో సాక్షాత్కరించాడు. 'శివుడు, శివుడు' అంటూ సభలో వాళ్ళంతా నిలబడ్డారు.

"రత్నపీఠంమీద కూర్చున్న తక్కిన పదకొండుగురు కవులూ లేచి, "వందేశంభు ఉమాపతిం" అంటూ స్తోత్రాలు మొద లెట్టేరు. వాదన వచ్చినప్పుడు 'నువ్వా నేనా?' అని డీకొనాలిగాని శివుడుకదా అని బెదరిపోయి స్తోత్రాలు మొదలెట్టడమా? అని నాకు పళ్ళు మండిపోయింది. ఏమైనా సరే నీ పద్యంలో తప్పులేకుండా పోతుందా? అని నేను వాదించేసరికి, శివునికి కోపం వచ్చి 'వళ్ళు తెలియకుండా మాట్లాడేవు గనక నీ వళ్లంతా కుష్ఠురోగం వచ్చి అసహ్యంగా కనపడుదువుగాక!' అని శపించాడు. గజగజ వణుకుతో పీఠం

మీదనించి దిగి పరుగున శివుని కాళ్ళమీద పడి క్షమించమని ప్రార్థించగా, ఆయనకి జాలికలిగి 'సరే వెళ్లు. కైలాస దర్శనం చేసిరా. అప్పుడు నీ కుష్ఠురోగం పోతుంది. ఎవడి కవిత్వంలోనైనా సరే మంచి ఉంటే మెచ్చుకో. అంతేగాని తప్పులు పట్టటం పనిగా పెట్టుకోకు' అని బుద్ధిచెప్పి అంతర్ధానం అయిపోయాడు. కైలాసం చూడటానికి వెడుతూ ఈ భూతానికి పట్టుపడి ఇక్కడకొచ్చాను" అని ముగించాడు.

నత్కీరుడిలా తన కథ ముగించాక కుమారస్వామి వెళ్ళిపోతో, "నువ్వెలాగైనా గొప్ప కవివి. గనుక నీకేమైనా వర మిద్దామని ఉంది. కోరుకో. ఇచ్చి వెడతాను" అన్నాడు.

నత్కీరుడు, "స్వామీ, నేని కుష్ఠు రోగంతో ఉండలేను. కైలాసాన్ని చూస్తే తప్ప ఈ రోగం పోదు. కైలాసం ఎక్కడో హిమవత్పర్వతాలలో ఉంది. అంతవరకూ నేని రోగంతో నడిచి వెళ్ళలేను. నాకు సులభంగా కైలాసదర్శనం చేయించు" అన్నాడు.

అప్పుడు కుమారస్వామి ఒక యుక్తి చేశాడు. "కైలాసమంటే శివుడుండే కొండ గదా. ఎక్కడ శివుడుంటే అదే కైలాసం. ప్రస్తుతం శివుడు మీ దక్షిణదేశంలోనే శాళహస్తి అనేచోట వెలిశాడు. అక్కడున్న కొండనే దక్షిణ కైలాసమంటున్నారు. అక్కడ దిగబెడతాను. ఆ కొండ చూచి నీ రోగం పోగొట్టుకో" అన్నాడు.

గుహలో వాళ్లందరివద్దా నత్కీరుడు సెలవు పుచ్చుకుని కుమారస్వామితో బయల్దేరి కాళహస్తి వెళ్లి అక్కడున్న కైలాసపర్వతాన్ని దర్శించాడు. కుష్ఠు రోగం పోయి అతనికి మామూలు శరీరం వచ్చింది. అప్పుడాకవి శివునిమీద నూఱు పద్యాలు చెప్పి స్తోత్రం చేసి, ఆ దేవుణ్ణి మెప్పించి మోక్షం సంపాదించుకున్నాడు.





# లొట్టిపిట్ట - పొట్టిమెడ

ప్రస్తుతం వుంటున్న ఈప్రపంచాన్ని దేముడు సృష్టిచేసినప్పుడు, జంతువులలోనూ, పక్షుల లోనూ కొన్నింటికి అసంతృప్తి కలిగింది. కొంగ మెడ మొదట చిన్నదిగా ఉండటం, పొడుగుమెడ కావాలని అది కోరుకునే వరకు దానిని బ్రహ్మ మరమత్తుచేయటం, ఆకథ లోగడ చెప్పుకున్నాము.

అలానే లొట్టిపిట్టకు మొదట్లో దేముడు పొడుగు కాళ్ళూ పొట్టి మెడా పెట్టాడు. అందుచేత అది మేత మేయడానికి, నీళ్ళు తాగటానికి చాలా కష్టపడుతుండేది. అట్టే కాలం ఈ అవస్థ పడలేక లొట్టిపిట్ట ఒక గుహలో పడుకొని, కళ్ళు మూసుకొని, ఘోరమైన తపస్సు ప్రారంభించింది.

చివరకు ఒకరోజున దేముడు ప్రత్యక్షమై "ఓ లొట్టిపిట్టా! నీ తపస్సుకు మెచ్చాను. ఏం కావాలో కోరుకో" అనే వరకు, అది దేమునికి సాష్టాంగపడి 'దేవాదిదేవా! నాకు ఏమి కావాలో నీకు తెలియదా? అయినా కోరుకోమన్నావు గనుక మనసు విప్పి కోరుకుంటున్నాను: నా శరీరంలో అవయవా లన్నీ చక్కగా అమర్చావు. కాని, కాలికి తగిన పొడవు మెడకు లేకపోవటంవల్ల చాలా చిక్కుగా వుంటున్నది. అందుచేత పొడవైన కంఠం అనుగ్రహించి పుణ్యాం కట్టుకోవలిసింది' అని కోరింది.

"సరే, నీ కంఠం ఒక యోజనం పొడవు విస్తరించుగాక!" అంటూ దీవించి, బ్రహ్మ అంతర్ధానమైనాడు. బ్రహ్మ వరం యివ్వగానే గుహలో పడుకొనివున్న ఆ లొట్టిపిట్ట మెడ యోజనం దూరంలో ఉండే ఒక మహారణ్యం వరకు పెరిగిపోయి అక్కడ ఆగింది.

ఇప్పుడు లొట్టిపిట్ట గుహలోనించే మెడ చాచి, యోజనం దూరంలో చుట్టుపక్కల ఉండే రకరకాల చెట్లపళ్ళూ, మహా

టి. మాధవరావు, అనంతపురం

నదులలో ప్రవహించే తియ్యటి నీరూ ఆరగించి హాయిగా ఉంటూవుంది.

అది తన తిండితిని, తన గొడవ చూచుకొంటూవుంటే బాగానే వుండిపోను. కాని, బ్రహ్మ ఇచ్చిన వరంవల్ల క్రమంగా లొట్టిపిట్టకు గర్వం ఎక్కువైపోయి, దుండగాలు చేయనారంభించింది. సింహం నిద్రపోతూ వుంటే దాని జూలు పట్టుకొని ఊపటం, ఆడపులి తన పిల్లలకు పాలిస్తువుంటే పులిపిల్లలను నోటితోకరిచి ఎక్కడికో విసిరివేయడం ఇలా ఆ ప్రదేశమంతా గగ్గోలు పరచి చిందరవందర చేసివేసేది.

అప్పుడు జంతువులన్నీ బ్రహ్మవద్దకు పోయి-మొరపెట్టుకోగా, 'అలాగా! దాని పని నేను సరిచేస్తా, మీరు వెళ్ళండి' అని చెప్పి బ్రహ్మ మరునాడు బ్రహ్మాండమైన వర్షం కురిపించాడు. లొట్టిపిట్ట శరీరం గుహలో ఉందిగా? దాని మెడ యోజనం దూరాన అరణ్యంలో ఉన్నదాయె. ఆ ఘోరవర్షంలో మెడ కూడదీసుకోటానికి వ్యవధిలేక, దానిని ఒక దట్టమైన తుప్పలో దూర్చి కిక్కురుమనకుండా పడుకుంది.

ఆ దారిన వస్తున్న నక్క ఒకటి దాన్ని చూచి ఏదో చచ్చిన జంతువనుకొని, లొట్టిపిట్ట మెడ కటుక్కున కొరికివేసింది. అప్పుడు వేలాడిపోతూవున్న మెడతో లొట్టిపిట్ట బ్రహ్మవద్దకుపోయి 'దేవా! బుద్ధి వచ్చింది, గర్వం అణిగింది' అని మొర పెట్టుకునే వరకు, బ్రహ్మ జాలిదలిచి, నక్క కొరికినంత మేరకు దాని కంఠంతీసి మెడను మళ్లీ జాగ్రత్తగా కుట్టిపంపించాడు. అప్పటినించి లొట్టిపిట్ట మెడ అట్టే పొడుగు కాకుండా, పొట్టీకాకుండా ఈనాడు మనం చూస్తూవున్న ఆకృతిలో అమరింది.

ఎవరిని ఏవిధంగా చూడాలో సర్వజ్ఞుడైన ఆ సృష్టికర్తకే తెలుసు. కనక 'అది కావాలి ఇది కావాలి' అని మనకు మనం కోరడంలో అర్థంలేదు.



# చందమామ పజిల్

(భాషాభివృద్ధికి)

## ఆధారములు

### అడ్డము :

1. భూస్వామి
4. పెద్దచదువులు నేర్పేచోటు
5. బంగారు నాణెము
9. మునలి
10. పశువు
12. శ్రీ రామునికి సహాయం చేసినై
13. ఒకరకం పండ్లు
15. పార్వతి




### నిలువు :

1. ప్రపంచం
2. వచనములు
3. శిరస్సు
4. కాంతి
5. మామయొక్క
6. నరకలోక అధిపతి
7. స్త్రీలు
11. మొగము
12. వక్షః స్థలము
14. రామ భక్తురాలు

## యుక్తి లెక్క

ఒకవూళ్లో ఒకధనవంతుడు వున్నాడు. అతను పిశినారి. అతనికి ఒక పెద్ద తోట వున్నది. ఆ తోట తడిపే మనిషికి రోజుకి నాలుగణాలకు మించి యివ్వ ననేవాడు. అందువల్ల అతని దగ్గిర నౌకరీకి ఎవరూ నిలిచేవారు కారు.

కాని ఒకరోజున ఒక కుర్రాడు వచ్చి, 'అయ్యా, తోటపనికి నన్ను నౌకరుగా పెట్టుకోండి' అన్నాడు.

అందుకు ధనవంతుడు 'మరి నీకు రోజు కూలీ ఎంత?' అని అడిగాడు.

కుర్రవాడు "అయ్యా! ఇవాళ నేను పనిలో చేరుతాననుకోండి. ఇవాళ ఒకే ఒక దమ్మిడీతో ప్రారంభించి రేపు రెండు దమ్మిడీలు, ఎల్లుండి నాలుగు దమ్మిడీలు, అమర్నాడు ఎనిమిది దమ్మిడీలు, ఇలా రోజు రోజుకి అ దమ్మిడీలు రెట్టింపు చేస్తూవుండండి. నెలాఖరుకి ఎంత యివ్వాలో యిద్దురుగాని" అన్నాడు. 'వీ డెవడో చౌకగా దొరికాడే.' అని సంతోషించి ధనవంతుడు అతన్ని పనికి ఏర్పాటుచేశాడు.

నెలా పూర్తి అయింది. నౌకరు వచ్చి 'బాబూ, నా లెక్క చూడండి' అన్నాడు. యజమాని లెక్క చూసి తను యివ్వ వలసిన మొత్తం యింతా అని తెలిసి మూర్ఛపోయాడు.

ధనవంతుణ్ణి ఈ స్థితికి తెచ్చిన ఆ మొత్తం ఎంతో కనుక్కోండి. తెలియక పోతే జవాబుకి 55-వ పేజీ చూడండి.




# పిల్లల పెంపకం

## ఆటవస్తువులు

పసిబిడ్డలకు ఆటలే ఆనందం. ఆటలుంటే చాలు, వాళ్ళకు అన్నంకూడా అక్కర లేదనిపిస్తుంది. వాళ్ళు బాగా ఆడుకోవటం మంచి ఆరోగ్యానికి నిదర్శనం.

కనుక, బిడ్డలను స్వేచ్ఛగా ఆడుకోనివ్వాలి. అయితే శిశువుల విషయంలో వాళ్ళకు ఈయవలసిన ఆటవస్తువులు ఎటువంటివిగా ఉండాలె?— అన్నది చాలా ముఖ్యమైన సంగతి. కాని, దీనినిగురించి సామాన్యంగా పెద్దలు ఏమీ గమనించరు. ఏడ్చే బిడ్డ ఊరుకోవటానికని విచక్షణలేకుండా, ఏది పడితే అది చేతికి అందిస్తూ వుంటారు. ఆ వస్తువులను గురించిన మంచి చెడ్డలు ఆలోచించనే ఆలోచించరు. బిడ్డకు ఏమిచ్చినా, వెంటనే దానిని నోటిలో పెట్టేసుకుంటాడు. ఇది విషమా,అమృతమా? అని పసిబిడ్డలు యోచించలేరు. కనుక, ఈ లక్షణాన్ని పెద్దవాళ్ళు గురుతుంచుకుని, నోటిలో పెట్టుకున్నా ఇబ్బందిలేని వస్తువులనే ఆడుకోవటానికి చేతికివ్వాలె.

తరుచు లక్కకాయలు బిడ్డలకు ఇవ్వటం మామూలు. పూతపూసిన లక్కరంగు పసివాని కడుపులోకి పోతే ఆరోగ్యం చెడుతుంది. అన్ని రంగులకంటె ముఖ్యంగా ఆకుపచ్చ రంగులో ఆరోగ్యాన్ని చెడగొట్టె గుణం ఎక్కువ. ఈసంగతి గమనించాలి.

రేకుతో తయారైన ఆటవస్తువులు ఇస్తే నవనవలాడే పసిపాపకి ఒళ్ళు కోసుకు పోవచ్చు. అందుచేత ఏమరి ఉండకూడదు.

సెల్యులాయిడ్‌తో తయారయ్యే ఆటవస్తువులు ఈనాడు కోకొల్లలుగా వస్తున్నయి. ఏమాత్రం నిప్పు తగిలినా ప్రమాదంవల్ల అవి గప్పుమని అంటుకొంటాయి. కనుక, ఇవీ పిల్లలకు ఇచ్చి ఉదాసీనంగా ఊరుకోవటానికి వీలులేదు. నన్ను అడిగితే, పూతపూయని లక్కకాయలు, ముళ్ళులేని బొంగరాలు, యిలాంటివి ఇస్తే అపాయం లేదంటాను.

'మీ పెద్దమ్మ'

# ఇంద్రజాలము

## అరటిపండు గమ్మత్తు

ఈ ట్రిక్కు పెద్దలేకాకుండా పిల్లలుకూడా చాలా తేలికగా చేసి చూపవచ్చు. కాని చూచేవారికి మాత్రం యిది చాల గొప్ప ట్రిక్కు అని తోస్తుంది.

ఇక మీరు ఈ ట్రిక్కు చేయవలసింది ఎలాగా అంటే— విందుకి వచ్చేముందు ఇంటి దగ్గరనే మీరు ఒక అరటిపళ్ల హస్తం తెప్పించి, హస్తంనించి పళ్లని తుంచకుండా ఒక సన్నని సూదితో ఒక్కొక్క పండుని లోపల గుజ్జుమాత్రం తెగేట్టు కొన్ని భాగాలుగా చెయ్యాలి. ఎలాగంటే సూదిని మొదట ఒకపండు తోలుగుండా గుచ్చి లోపల గుజ్జుమాత్రం గుండ్రంగా తెగేట్టు సూదిని తిప్పాలి. ఇది ఎలా చెయ్యాలో ఈ పేజీలోని బొమ్మలో చూపబడింది. ఇలా మొదటిపండును మూడుచోట్ల సూదితో గుచ్చి, లోపలి గుజ్జు గుండ్రంగా మూడు భాగాలు అయేట్టు చేయండి. తర్వాత రెండోపండుని నాలుగు భాగాలు అయేట్టు చేయండి. ఇలా హస్తంలో ఆరు పళ్ళు వుంటే ఒకదాంటో మూడుభాగాలు, మరో దాంటో నాలుగుభాగాలు, మరోదాంటో రెండుభాగాలు, ఇలా రకరకాలుగా తయారుచేసివుంచుకోండి. కాని హస్తంలో ఏ పండుని ఎన్ని భాగాలు చేసింది ఒక వరసప్రకారం గుర్తుంచుకోవటం చాలా ముఖ్యం. తర్వాత సూదితో లోపలి గుజ్జుని కోసేటప్పుడుకూడా పైతోలు తెగకుండా చూసుకోవటంకూడా చాలా ముఖ్యం.

మీరు విందుకు వెళ్లినప్పుడు మీ స్నేహితులతోపాటు ఒక బల్లదగ్గిర కూర్చొని మీరు తెచ్చిన అరటిపళ్ల హస్తాన్ని బల్లమీద వుంచండి. తర్వాత ఆ మాట





ఈ మాట చెబుతూ "యిప్పుడు నేనొక గమ్మత్తు చేస్తాను కాచుకోండి" అనేసరికి మీ స్నేహితులు ఏమిటి అని చూస్తారు.

అప్పుడు అరటిపండు హస్తంలోంచి ఒక పండుని తుంచి—'ఇదుగో ఈ అరటి పండు చూడండి. దీని తోలు వొలిచేసరికి పండు దానంతట అదే మూడుముక్కలు అయిపోతుంది" అనండి.

"ఈ పండులో ఏదో మాయ వుంది. ఏదీ యిలా యివ్వు ఆ పండు" అని మీ స్నేహితులు అడుగుతారు. మీరుసందేహించకుండా పండుని వాళ్లు పరీక్షించుకోవటానికి యివ్వవచ్చు. సూదితో గుచ్చిన చోట అనవాలుకూడా తెలియకుండా మీరు జాగ్రత్త పడే వుంటారు కనుక మీ స్నేహితులు పండులో ఏమీ మోసంలేదని నమ్ముతారు.

వెంటనే మీరు ఆ పండు తోలు వొలిస్తే పండు మూడు ముక్కలుగా దానంతటదే విడిపోతుంది. తర్వాత రెండో పండు చూపి "దీన్ని నాలుగు ముక్కలు చేస్తాను" అని అలా చేసి చూపించాలి. ఇలాగే మిగతా పళ్లుకూడా ఒకటొకటే ఒలిచి చూపాలి.

ఈ ట్రిక్కు చూసిన మీ స్నేహితులు, మీరొక మంత్రగాడో, లేక తంత్రగాడో, అనుకుంటారేగాని మీరు యిది ఎలా చేసిందీ వాళ్ళకి ఏమాత్రమూ తెలియదు.

ఆసక్తిగల పాఠకులు, ఈ గారడీనిగురించి ఉచితంగా సలహా పొందదలిస్తే, వారు 'చందమామ' పత్రికపేరు ఉదహరిస్తూ ప్రొఫెసరుగారికి వ్రాయవచ్చు. మీరు వారికి ఉత్తరాలు ఇంగ్లీషులోనే వ్రాయాలి. వారి అడ్రసు యిది:—

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మేజిషియన్,
పోస్టుబాక్సు 7878, కలకత్తా—12.



## వినోద చదరం

క్రింది చదరంలో నాలుగు మాటలను, యిచ్చిన అక్షరముల సహాయముతో పూర్తిచెయ్యాలి. మీరు చెయ్యలేకపోతే జవాబు ఈ పేజీలో నేవుంది చూడండి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | మ | ర | | | |
| 2. | | మ | ర | | |
| 3. | | | మ | ర | |
| 4. | | | | మ | ర |

1. నవరత్నాలలో ఒకటి
2. దేవలోకం
3. ఏమరుపాటు
4. పూజకు పనికిరాని ఒకపువ్వు

### 49-వ పేజీలోని యుక్తిలెక్కకు జవాబు :

ధనవంతుడు నెలాఖరున నౌకరుకు 531.628.032 దమ్మిడీలు యివ్వ తేలాడు. అంటే ఇరవై ఏడులక్షల, అరవై ఎనిమిది వేల, ఎనిమిదివందల తొంభై ఆరు రూపాయలు యివ్వవలసి వచ్చిందన్నమాట. ఇంత పెద్ద మొత్తం యివ్వవలసి వస్తుందని అతను కలలోకూడా అనుకోలేదు. కనుకనే ధనవంతుడు అలా ఒక్కసారిగా మూర్ఛపోయాడు.

### పజిలుకు జవాబు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | 1 భు | 2 గ | 3 త | | | |
| | 4 వి | 5 శ్వ | వి | ద్యా | ల | 6 య | 7 ము | |
| | 8 కా | సు | | లు | | 9 ము | ది | |
| 10 ప | స | ర | 11 ము | | 12 ఉ | డు | త | లు |
| | ము | | 13 ఖ | ర్జూ | ర | | లు | |
| | | | ము | | ము | | | |
| | | | | 14 శ | | | | |
| | | | | బ | | | | |
| | 15 హి | మ | గి | రి | త | న | య | |

### 51-వ పేజీలోని చిక్కుబొమ్మ ఈవిధంగా అతికించాలి :

1 2 3 4 5 6

### వినోద చదరం జవాబు :

1. మరకతము; 2. అమరపురి;
3. ఆదమరపు; 4. మెట్టతామర




ఈ ఖడ్గమృగం బొమ్మకి రంగులువేసి 'మే' చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.

Controlling Editor : SRI CHAKRAPANI
Printed and Published by B. NAGI REDDI at the B. N. K. Press Madras 1

CHANDAMAMA (Telugu) APRIL 1950 Regd. No. M. 4854




" నీ గాండ్రింపులు నాదగ్గిరనా ?"